# పాత్రలు

| మూలంలో | అనుకృతిలో |
| --- | --- |
| 1. ఇరీనీ నికొలాయెవ్నా ఆర్కాడీన్ (నటి) | మాలతి |
| 2. కాన్‌స్టాంటిన్ గావ్రీలొవిచ్ ట్రిప్లేవ్ (ఆమె కొడుకు) | వసంత |
| 3. పీటర్ నికొలాయెవిచ్ సోరిన్ (ఆమె అన్న) | శేఖరం |
| 4. నీనా మిఖేలోవ్నా జారిఖ్నీ (ఒక యువతి) | లీల |
| 5. ఇల్యా అఫనాసెవిచ్ షామ్రయేవ్ (సోరిన్ ఎస్టేటు మానేజరు) | రామనాథం |
| 6. పొలినీ ఆంద్రీయెవ్నా (అతని భార్య) | సుశీల |
| 7. మాషా (అతని కూతురు) | రాజ్యం |
| 8. బోరిస్ అలెక్సీవిచ్ ట్రిగోరిన్ (నవలా రచయిత) | ప్రకాశ్ |
| 9. యోగినీ సెర్గెవిచ్ డోర్న్ (డాక్టరు) | శర్మ |
| 10. సెమ్యాన్ సెమ్యొనోవిచ్ మేద్వేడెంకో (బడిపంతులు) | సూర్యం |
| 11. యాకోవ్ (కూలీ) | వాలాయుమ్ |
| 12. వంటవాడు | |
| 13. పనికత్తె | |

# ఒ క టో  అం కం

[శేఖరంగారి యింటితోటలో భాగం. ప్రేక్షకులనుంచి సరస్సువైపుగా తోటలోపలికి దూసుకుపోయే విశాల మైన రోడ్డూ, రోడ్డుకిరుప్రక్కలా చెట్లు. సరస్సు ఏ మాత్రం కన్పించకుండా రోడ్డుకడ్డంగా ప్రదర్శనానికి తొందరగా కట్టినస్టేజీ. స్టేజీప్లాట్ఫారానికి యిరువైపులా పొదలు, కుర్చీలు, చిన్నబల్ల. అప్పుడే సూర్యాస్త మయం అయింది. తెరవెనక ప్లాట్ఫారంమీద వాలాయ్ మరికొందరు కార్మికులు పనిచేస్తున్నారు. దగ్గూ, సుత్తుల చప్పుడూ విన్పిస్తున్నవి. రాజ్యం, సూర్యం వాహ్యాళికివెళ్ళి తిరిగి ఎడమవైపునించి వస్తున్నారు.]

సూర్యం: యేమిటి రాజ్యం! మాసిన చీరకట్టి యేదో విచా రంలో మునిగిపోయిందాన్లా కన్పిస్తావేం?

రాజ్యం: యిదేం బతుకా అని యేడుస్తున్నా. నాకు సుఖ మంటూ లేదు.

సూర్యం: యెందుకనేం? (ఆలోచనాపూర్వకంగా) నాకర్థం కావటంలేదు... ఆరోగ్యంగానే వున్నావ్. పెద్ద డబ్బున్న వాడు గాకపోయినా మీ నాన్న పని బాగానేవుంది,

నాదైతే అర్ధాన్నపు బతుకుగాని - మొత్తం నెలకు 30 రూపాయలు వస్తాయి. దీంట్లోనుంచి పెన్షను ఫండుకు కొంత పోతుంది. అయినా నేను మాసిపోయిన బట్టలు కట్టడంలేదే ! (యిద్దరూ కూర్చుంటారు)

రాజ్యం : డబ్బుకేం - బీదావాడైనా సుఖపడచ్చు.

సూర్యం : ఇదంతా మాటల్లోనే. అనుగమంలోకి వచ్చేసరికి తెలిసొస్తుంది. తల్లీ, యిద్దరు చెల్లెళ్ళూ, ఓ చిన్నతమ్ముడూ, నేనూ - మొత్తం 30 రూపాయలు జీతం. బియ్యంకావాలి, పప్పులు కావాలి. ఉప్పూ మిరపకాయా కావాలి. కాఫీ నీళ్ళుకావాలి. యిదీ నా అవస్థ. కాదూ ?

రాజ్యం : (ప్లాట్‌ఫారంకేసి చూస్తూ) ప్రదర్శనం త్వరగానే ప్రారంభ మవుతుందనుకుంటా.

సూర్యం : ఆ-లీలాదేవి నటిస్తుంది. నాటకం రాసింది వసంత్. వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారు. సామరస్య కళామయ రూపకల్పనలో వారి ఆత్మలు రెండూ నేడు ఐక్యమవుతాయి. కాని నీ ఆత్మకూ, నా ఆత్మకూ సామాన్య ఐక్యతా స్థితి లేదుగా. నేను నిన్ను ప్రేమిస్తున్నా. వేదనమూలంగా యింట్లో కూర్చోలేక పోతున్నా. నిత్యం ఆరు మైళ్ళు రానూ ఆరుమైళ్ళు పోనూ. అయితే యేం లాభం ? నువ్వు సుముఖంగా లేవ్. అర్ధమవుతోంది. నాకు రాబడా శూన్యం, పోషించాల్సిన కుటుంబమూ పెద్దది ... తన్ను తా పోషించుకోలేని వాణ్ణెవళ్ళు పెళ్ళి చేసుకుంటారు !

రాజ్యం : ఊఁ. పోనిద్దూ. నీ ప్రేమ నా హృదయాన్ని తాకుతోంది. కాని తిరిగి ప్రేమించలేను. అంతే (విరామం)

వుక్కపోస్తున్నది. రాత్రికి గాలీ వానా వస్తుంది. నువ్వె
ప్పుడూ డబ్బు, డబ్బూ అంటూ కబుర్లు చెబుతావే.
దరిద్రం కంటె దురదృష్టం లేదని నీ అభిప్రాయం. కాని
నా మనసుకు అంతకన్నా చిరుగు గుడ్డల్లో ముట్టెట్టుకోటం
వెయ్యి రెట్లు నయం. అయినా నీకర్థం కాదులే.
(కుడివైపునుంచి శేఖరం, వసంత్ ప్రవేశం)

శేఖరం: (చేతికర్రమీద ఆనుకుని) పల్లెటూరు నాకు సరి
పడదు. అలవాటూ లేదు. రాత్రి పది గంటలకల్లా నిద్ర
బోయాను. ఉదయం తొమ్మిదింటికి లేచా. చాలసేపు
నిద్రపోవడంవల్ల నా మెదడు పుర్రెకు అంటిబెట్టుకుని వుందా
లేదా అని సందేహం వచ్చింది. (నవ్వుతూ) తింటితిని
అనుకోకుండా మళ్ళీ వారిగా. పీడకల కంటూన్నట్టు బాధ
బడుతున్నా. యిదీ అసలు సంగతి.

వసంత్: నువ్వు బస్తీలో నివసిస్తే బాగుంటుంది మామా!
(రాజ్యం, సూర్యాలను గమనించి) నాటకం ప్రారంభించ
గానే పిలుస్తా. ఇక యిక్కడ మీరుండకూడదు. వెళ్ళండి.

శేఖరం: (రాజ్యంతో) రాజ్యం! కుక్కగొలుసు విప్పమని
మీ నాన్నతో చెప్పు. అది మొరుగుతూనే వుంది.
మళ్లీ రాత్రంతా చెల్లికి నిద్రపట్టనే లేదు.

రాజ్యం: మా నాన్నగారితో మీరే చెప్పండి. నేను చెప్ప
లేను. (సూర్యంతో) రాండి – వెడదాం.

సూర్యం: (వసంత్ తో) నాటకం ప్రారంభించే ముందు కబురు
పంపుతారుగదూ? (యిద్దరూ వెడతారు)

శేఖరం : మళ్ళీ రాత్రిళ్లా కుక్క మొరుగుతుందన్నమాట. యేం చోద్యం ! నాకు వచ్చినట్టు గ్రామసీమలో యెన్నడూ నివసించలేదు. నెలరోజులపాటు శెలవుతీసుకుని విశ్రాంతి తీసుకోటానికి ఇక్కడకు వచ్చేవాణ్ణి, వచ్చిందరోజునే ఇక్కడ నుంచి పట్నానికి వెళ్ళిపోవాలనేటంతగా నను రొష్టు పెట్టేవాళ్ళు. (నవ్వుతూ) యిక్కడనించి వెళ్ళిపోవడమంటే నాకెంతో సంతోషం...సరే – రిట్టైరైపోయాను. యింకె క్కడికి వెళ్ళేది ? యిదీ అసలు సంగతి. యిష్టమున్నా లేకపోయినా యిక్కడే పడివుండాలి.

వాలాంగ్ : (వసంత్ తో) తానానికి యెల్లుతున్నాం దొరా.

వసంత్ : సరే. పది నిమిషాల్లో మళ్లీ యెవరిచోట వాళ్లుం డండి. (చేతిగడియారం చూస్తూ) నాటకం తొందరగానే ప్రారంభ మవుతుంది.

వాలాంగ్ : సరే దొరా. (వెళ్ళిపోతాడు)

వసంత్ : (స్టేజివంక త్వరిత దృష్టిబరిపి) యిదిగో ! రంగస్థలం. తెర – తెరవెనక మొదటిసైడు కర్టను. వెనక రెండోది. ఆ తర్వాత ఖాళీస్థలం. సీనరీ అంటూ లేనేలేదు. ఆ వెనక సరాసరి సరస్సు, దిఙ్మండలం. చంద్రోదయం అయిం తర్వాత సరిగ్గా ఏడుగంటలకి తెరయెత్తుతాం.

శేఖరం.: బలే బలే !

వసంత్ : లీల ఆలస్యంచేస్తే యీ భావమంతా తగలడి పోతుంది. ఈపాటికే రావలసింది. తండ్రీ, సవితితల్లీ, ఆమెకి కాపలా. యింట్లోనించి తప్పించుకు రావటం జైల్నించి తప్పించుకురావడ మంత కష్టం. (శేఖరం వై

సరిజేస్తూ) నీ జుట్టు, గడ్డం మాసిపోయాయి. క్షవరం చేయించుకో మామా!

శేఖరం: (గడ్డం దువ్వుకుంటూ) యిదే నాజీవితంలోని విషాద రేఖ. యవ్వనంలోకూడా తాగిననాడిలా కన్పించేవాణ్ణి. ఆడవాళ్ళు యెన్నడూ నన్ను ప్రేమించలేదు. (కూర్చుంటూ) చెల్లాయి హుషారుగా లేదేం?

వసంత్: హుషారుగా యెందుకులేదా! విసిగెత్తింది. (పక్కన కూర్చుంటూ) చుప్పనాత్తనం పుట్టింది. నేనన్నా, నా నాటకమన్నా, యీ ప్రదర్శనమన్నా గిట్టటంలేదు. యెం దుకో తెలుసా? యిందులో లీల నటిస్తుంది. తాను నటించడంలేదు. నా నాటకం గురించి యేమాత్రమూ అమ్మకి తెలీదు. అయినా అసహ్యించుకుంటున్నది.

శేఖరం: (నవ్వుతూ) నిజంగానే? అంతా నీ వూహాకల్పన...

వసంత్: ఈచిన్న స్టేజీమీద తనకు గాకుండా లీలకు విజయం లభిస్తుందని అమ్మకి ఉక్రోషం. (చేతిగడియారం చూస్తూ) మా అమ్మ మన స్త్రత్వం వో పద్మవ్యూహం. ప్రతిభావంతు రాలవడంలో యేమాత్రం సందేహంలేదు. తెలివిగలది. నాటకం చదువుతూ బాగా యేడవగలదు. సారంగధర నాటకం యేకోదమ్మున అప్పగించగలదు. రోగులకి ఉప చారం చేయటంలో దేవతే. కాని ఆమెముందు యే భానుమతినో పొగడ్తూ వొక్కమాట అని జూడు. ఓహోహో! తన నొక్కతనే పొగడాలి. తనొకతను గురించే పొగుడ్తూ రాయాలి, చర్చించాలి. సారంగధర లోనో, చింతామణిలోనో అద్భుతంగా నటిస్తుంటే ప్రేక్ష

కులు తన్మయులైపోతారు. కాని యిక్కడ యీ నల్ల టూర్లో యీ నల్లమందు పడటం లేదు. విసిగెత్తింది. చిర చిరారంభమయింది. అమ్మ దృష్టిలో మనమంతా శత్రువులం. నిందార్హులం. యింతేకాకుండా మూఢనమ్మకాలు యెక్కువైనాయి. తుమ్మితే భయం, దగ్గితే భయం. ముక్కుమీద కోపం. మద్రాసు బ్యాంకులో డబ్బై వేలు దాచుకుంది. నిజం. నాకు తెలుసు. అప్పడిగిచూడూ, యేడుపు మొదలెడుతుంది.

శేఖరం: మీ అమ్మకి నీ నాటకమంటే యిష్టంలేదనుకుంటున్నావ్. తబ్బిబ్బవుతావ్. యికచాలు వూరుకో. మీ అమ్మ నిన్ను ప్రేమిస్తుంది.

వసంత్: (పువ్వురేకులు గిల్లుతూ) ప్రేమిస్తుంది. ప్రేమించదు. ప్రేమిస్తుంది. ప్రేమించదు. ప్రేమిస్తుంది. ప్రేమించదు. (నవ్వుతూ) మామా! చూడూ, అమ్మ నన్ను ప్రేమించదు. జీవించాలనీ, ప్రేమించాలనీ, లేతరంగు రవికలు తొడుక్కోవాలనీ కాంక్షిస్తుంది. నా కప్పుడే పాతికేళ్లు. అమ్మ యింకా చిన్నదికాదని అనుక్షణమూ జ్ఞప్తికి తెస్తుంటాను. నేను దగ్గర లేకపోతే ముప్ఫయియేళ్ళదే. నాముందు మాత్రం నలభైయేళ్ళది. అందుకని అమ్మకు నేనంటే అసహ్యం. నేటి నాటకరంగమంటే నాకు గిట్టదని తెలుసు. నాట్యకళను ప్రేమిస్తుంది. మానవకోటికీ, పవిత్రకళకూ సేవజేస్తున్నాననుకుంటుంది. కాని నేటి నాటకరంగం గానుగెద్దులాగా, మూఢత్వంతో నడుస్తోంది. తెర యెత్తగానే కృత్రిమదీపాల వెలుగు, గదికి మూడే గోడలు.

యీ మహా ప్రతిభావంతులు, యీ పవిత్రకళారాధకులు ప్రజలు ఎలాతింటారో, తాగుతారో, ప్రేమించుకుంటారో, నడుస్తారో, అంగీలు ధరిస్తారో చూపుతారు. సాధారణ రంగాలలో, సమాసాలలో నీతి బోధించాలని చూస్తారు. తేలికగా అర్థమయే చిన్ననీతి, రోజువారీ అవసరాలకి వుప యోగబడే నీతి వెయ్యిరకాలుగా వొకటే తిప్పితిప్పి అంద జేస్తే తలభారంతో పారిపోతాను! పారిపోతాను!

శేఖరం: స్టేజీని వదులుకోలేంగా?

వసంత్: మనకు నూత్నరూపాలు కావాలి. నూత్న రూపాలు కావాలి. అవి లేకపోతే యేదీవద్దు. (గడియారం చూస్తూ) అమ్మను ప్రేమిస్తా. అమితంగా ప్రేమిస్తా. కాని పనికి మాలిన జీవితం గడుపుతోంది. ఆ నవలా రచయితను చేరదీసింది. అమ్మపేరు పత్రికల్లోకి నిత్యమూ యెక్కు తోంది. యిదీ నాకు కష్టం కలిగిస్తున్న విషయం. వొక్కొ క్కప్పుడు సాధారణ మానవుడిలోని అహం నాలోనూ పైకుబుకుతుంది. నా తల్లి ప్రఖ్యాత నటికావడం నాకే విచారం వేస్తున్నది. సాధారణ స్త్రీ అయివుంటే ఎంతో సుఖపడేవాణ్ణి. మామా! ఇంతకంటే నిరాశా, అవివేక స్థితీ వుందా? అమ్మచుట్టూ అతిథులు - సుప్రసిద్ధ పురు షులూ, నటులు, గ్రంథకర్తలు. అందర్లో వూరూ పేరూ లేనివాణ్ణి నేనొక్కణ్ణే. ఆమె కొడుకుని కాబట్టి అందరూ సహిస్తున్నారు. నేనెవర్ని? నాకేముంది? నన్నుగురించి పత్రికల్లోబడ్డ అవకతవక విషయాలవల్ల చదువుకు స్వస్తి వచ్చింది. నాకు ప్రతిభ లేదు - నా స్వంతం అనేది కాసీ

అయినా లేదు. నేను సామాన్య పౌరుణ్ణి. మా నాన్నా అంతే. యిక ఇప్పుడు – కచేరీ సావిడిలో ఆ నటులూ, రచయితలూ, నా మీద దయ కురిపిస్తూంటే వారి చూపుల్లో నా అల్పత్వం కొలుస్తున్నట్లనిపిస్తుంది. వారి భావాలు వూహించా. అవమానంతో కుంగిపోయా.

శేఖరం : ఆ – ఆ నవలా రచయిత యెలాంటివాడు? నేను తెలుసుకోలేక పోతున్నా. ఎప్పుడూ మౌనంగా వుంటాడు.

వసంత్ : తెలివైనవాడు, నిరాడంబరి, కొంచెం దుఃఖి. మంచి మర్యాదస్తుడు. నలభై యేళ్ళున్నా లేవు. అప్పుడే ప్రఖ్యాతి సంపాదించుకున్నాడు. పూర్తిగా అనుభవించాడు. ఇక అతని రచనలు... యేం జెప్పను? బాగుంటాయ్. ప్రతిభ కన్పిస్తుంది. కాని టాల్‌స్టాయ్, జోలాల రచనలు చదివి నాక యీ ప్రకాశ్ రచనలు చదవాలనిపించదు.

శేఖరం : సరే – నాకూ రచయితలంటే యిష్టమే. ఒకప్పుడు రెంటికోసం మహా తాపత్రయపడ్డా. ఒకటి : పెళ్ళిచేసుకోవాలనీ, రెండు : గ్రంథకర్తను కావాలనీ. ఒకటీ సాధించలేకపోయా. చివరికి చిల్లర రచయితనైనా కాలేకపోయా. యిదీ అసలు సంగతి.

వసంత్ : (వింటూ) అడుగుల చప్పుడు వినిపిస్తోంది. (శేఖరంను కౌగలించుకుని) ఆమె లేకుండా బతకలేను... ఆమె అడుగుల చప్పుడుకూడా నాలో మోహం రేకెత్తిస్తుంది... పిచ్చిగా సంతోషిస్తా ... (ప్రవేశిస్తున్న లీలను కలుసుకోడానికి పరుగెత్తుతూ) మోహినీ! నా స్వప్నదేవతా!

లీల : (ఆందోళనగా) ఆలస్యంచేశానా? అబ్బే లేదే!

వసంత్ : (ఆమె చేతులు ముద్దిడుకుంటూ) అబ్బే! లేదు. ఆలస్యం చేయలేదు.

లీల : పగలల్లా ఆందోళనా, భయం వేసింది. మా నాన్న రానివ్వడని భయపడ్డా... మా మారుటమ్మతో యెక్క డికో వెళ్లాడు. ఆకాశం యెర్రగావుంది. చంద్రుడు ఉద యిస్తున్నాడు గుర్రంమీద దౌడుతీశా... దాహం తీయించా... (నవ్వు) హాయిగావుంది!

శేఖరం : (నవ్వుతూ) నీచిన్నికళ్లు కన్నీళ్ళతో ఎర్రబారాయి. ఓ... ...ఓ... యేడవకూడదు!

లీల : పర్వాలేదు. చూడండి. అలిసిపోయా. అరగంటలో తిరిగి వెళ్లిపోవాలి. తొందరగా నాటకం ముగించండి. వద్దు, వద్దు. నన్ను యెక్కువసేపు నిలపకండి. యిక్క డున్నానని నాన్నకు తెలీదు.

వసంత్ : ఔను వేళైంది. అందర్నీ పిలవాలి.

శేఖరం : నేను పిలుస్తా. యిప్పుడే పిలుస్తా. (కుడివైపుకు వెళ్ళి పాడుతూ)

" వెడలె కోదండపాణీ"

(వెనక్కి తిరిగి చూచి) ఒకప్పుడు యిలా పాడుతూంటే ఒక జూనియర్ గవర్నమెంటు ప్లీడరు అన్నాడు. "వారగారి గొంతు కంచులాంటిదే..." కొంచెంసేపు ఆలోచించిమళ్లీ అన్నాడు అయితే గార్దభస్వరం" (నవ్వి వెళ్ళిపోతాడు.)

లీల : నాన్నా, మాగుటమ్మా నన్నిక్కడికి రానీయరు. మీరంతా దేశ దిమ్మర్లట!... నేను నాటకాల్లో వేషా లేస్తానని వాళ్ళభయం ... కాని నీటికాకిని ఆకర్షించినట్లు

ఈ స్వర్గాన్ని వర్ణించాలని నన్నాకర్షిస్తోంది. నా హృదయం నీ వశమై పోయింది. (చుట్టూ చూస్తుంది)

వసంత్ : ఒంటరిగా వున్నాం.

లీల : యెవరన్నా వున్నారను కొంటా.

వసంత్ : యెవరూ లేరు.

లీల : యిదేం చెట్టు?

వసంత్ : తవిసె చెట్టు.

లీల : యెందుకంత చీకటిగా వుంది ?

వసంత్ : సాయంత్రమైపోయింది. అన్నీ చీకటి మయమై పోయాయి. పెందలకడే వెళ్ళకు, నిను బతిమాలుకుంటా.

లీల : ఉహూం వెళ్ళాలి.

వసంత్ : మీ యింటి దగ్గిరికి వస్తానను కో, లీలా! రాత్రంతా మీ తోటలో నిల్చుని నీ కిటికీకేసే చూస్తూ వుంటానేం ?

లీల : వసంత్ ! నీవు రాకూడదు. కాపలావాడు చూస్తాడు. మా కుక్క నీ కింకా మచ్చికా లేదు. మొరుగుతుంది.

వసంత్ : నిను ప్రేమిస్తున్నా లీలా !

లీల : యిష్ !

వసంత్ : (అడుగుల చప్పుడు విని) యెవరక్కడ ? నువేనా వాలాయ్ !

వాలాయ్ : (ప్లాట్ఫారం వెనకనించి) ఔను దొరా !

వసంత్ : మీ రందరూ మీమీ స్థానాలకి వెళ్ళండి. వేళైంది. చంద్రుడు పైకొస్తున్నాడు.

వాలాయ్ : సరే, దొరా !

వసంత్ : డ్రావకాలున్నాయా? గంధకముందా? యెర్రటి కళ్ళు కనిపించినపుడు గంధకం వాసనగొట్టాలి. (లీలతో) రా, అంతా సిద్ధమైంది. యేం? భయమేస్తోందా?

లీల : ఆ-భయమేస్తోంది. మీ అమ్మంటే నాకు లక్ష్యమూ లేదు. భయమూ లేదు. కాని ప్రకాశ్ యిక్కడున్నాడు. ...ఆయన ముందు నటించటమంటే భయమేస్తోంది. సిగ్గేస్తోంది. ప్రఖ్యాత రచయితాయెను. చిన్నవాడేనా?

వసంత్ : ఔసాను.

లీల . ఆయన కథలు యెంత అద్భుతంగా వుంటాయ్!

వసంత్ : (నిరుత్సాహంగా) యేమో నాకు తెలీదు. ఎప్పుడూ వాటిని చదవలా.

లీల : నీ నాటకం ఆడటం మహాకష్టం. పాత్రల్లో జీవం లేదు.

వసంత్ : జీవం లేదూ! వున్నదున్నట్లుగా గానీ, వుండవలసిన రీతిగాగానీ జీవితం చూపించకూడదు. మన స్వప్నంలో కనిపించినట్లు చూపాలి.

లీల : నీ నాటకంలో అభినయానికి యెక్కువ అవకాశం లేదు. భట్టీవేస్తే చాలు. నాటకంలో ప్రేమగొడవ వుండాలను కుంటా... (ఇద్దరూ ప్లాట్‌ఫారం వెనక్కి వెడతారు)

(సుశీల, డా॥ శర్మ ప్రవేశం)

సుశీల : తేమగావుంది. తిరిగెళ్ళి రబ్బరుబూట్లు వేసుకురా.

శర్మ : యేం పర్వాలేదు వెచ్చగానే వుంది.

సుశీల : యెన్నడూముందుజాగ్రత్తపడవ్, మొండితనం? నువ్వు డాక్టరువి. చెమ్మగాలి నీకు సరిపడదని తెలిసిగూడా నన్ను

శోభ పెట్టాలని చూస్తున్నావ్. నిన్న సాయంకాల మంతా డాబామీద కావాలని భైరాయించావ్ గదూ.

శర్మ: (కూనిరాగం తీస్తూ)

"అనబోకేం యువ్వనాన్ని వృథా వృథా అనబోకేం"

సుశీల: మాలతితో మాటల్లో పొళ్లు మరచేబోయావ్...

చలిసంగతే పట్టలే. దాని వల్లోపడ్డావుకదూ!

శర్మ: నాకు యాభై అయిదేళ్లు.

సుశీల: పోదూ, మొగాడికి అదేమంత పెద్ద వయసుగాదులే!

యింకా బాగా పుష్టిగా ఆకర్షణీయంగా వున్నావ్.

శర్మ: యింతకీ యేవిటి నువు చెప్పవచ్చేది?

సుశీల: వేషాలువేసే ఆడాళ్ల ముందు మోకరిల్లడానికి మీ రంతాతయారు. మీ రంతా...

శర్మ: (కూనిరాగంతో) "తిరిగీ నీ ముందిదిగో". నటీనటులకు సంఘంలో గౌరవం, వర్తకులకంటే భిన్నంగా పరిగణనా కలుగుతున్నదంటే అలాజరగవలసిందే. ఇది ఆదర్శవాదం.

సుశీల: ఆడవాళ్ళు నిన్ను ప్రేమించి యెప్పుడూ నీ మెడకు వేలాడతారు. యిదీ ఆదర్శవాదమేనా?

శర్మ: (బుజాలు ఎగరవేస్తూ) యేం? స్త్రీలతో సంబంధంలో యెంతో అందం వుంది. వాళ్లు ప్రధానంగా ప్రేమించేది నా వైద్యాన్ని. జ్ఞాపకముండా పదిపదిహేళ్ళకితం వరకూ యీ ప్రాంతాల కంతటికీ నేనొక్కణ్ణే మంచి కాన్పుల వైద్యుణ్ణి. యింతేకాదు, యెప్పుడూ గౌరవంగాబతికేవాణ్ణి.

సుశీల: (చెయ్యి పట్టుకుని) ప్రియతమా!

శర్మ: వూరుకో, యెవరో వస్తున్నారు.

[ప్రవేశం శేఖరం వసంత్ ల చేతులు పట్టుకుని మాలతీ, రామనాథం, సూర్యం, రాజ్యం]

రామనాథం: వెనక యెంత అద్భుతంగా నటించేదనుకున్నారు కాంచనమాల! పరమానందం! అత్యద్భుతనటన! పూర్వం ఆడవేషాలు వేసే స్థానం యిపుడెక్కడున్నాడో మీకు తెలీదనుకుంటా. మధురవాణి వేషంలో యెవరూ అతన్ని అనుకరించలేరు. సంజీవరావుకంటే ఘనుడు. యిప్పుడెక్కడున్నాడు, దొరసానీ!

మాలతి: యెప్పుడో తాతలనాటివాళ్ళని గురించి అడిగితే యేం జెప్పను. (కూర్చుంటుంది)

రామ: (ఊపిరి గట్టిగా పీలుస్తూ) బళ్ళారి రాఘవాచారి, అతనిలాంటి నటులేరీ? రంగస్థలం చివికిపోయింది. పూర్వం సిందూర వృక్షంలాంటి వాళ్ళుండేవారు. యిపుడు బోదెలు మాత్రమే కనిపిస్తున్నాయి.

శర్మ: ఇప్పుడు గొప్పగొప్ప మేధావంతులు లేనిమాట నిజమే గాని సాధారణ నటుడు వృద్ధిలోకి వచ్చాడు.

రామ: ఊహుఁ – నీమాట వొప్పుకోను. రుచిభేదం. "లోకో భిన్న రుచిః" అన్నారు పెద్దలు.

(ప్లాట్‌ఫారం వెనకనుంచి వసంత్ ముందుకు వస్తాడు.)

మాలతి: (కొడుకుతో) బాబూ! నాటకం యెపుడారంభమవుతుంది?

వసంత్: నిమిషంలో... కొంచెం తాళండి.

మాలతి: "వన్నెతరగనీ చిన్నబోనీ
కారువల్లని గరుకు మబ్బులు

చూచా, నా ఆత్మవైపు
నువ్వు తిప్పిన నా కన్నుల !"

వసంత్ : "పాపపు పర్యంక ఘర్మ
వంకంలో నును వెచ్చని
కుళ్ళుబొంత ముసుకు పెట్టి
పందిగుంటపై ప్రేమను
చూపిస్తూ మాధుర్యం
ప్రకటిస్తూ బతకాలంటే !"

[ప్లాట్ఫారం వెనుకనుంచి కొమ్ము ఊదినధ్వని]

వసంత్ : యిక ప్రారంభమవుతుంది. జాగ్రత్తగా వినండి. (విరామం) యిక ప్రారంభిస్తా. (చిన్న కర్రతో నేలమీద కొట్టి బిగ్గరగా) ప్రతిరాత్రీ యీ సరోవరం చుట్టూ తిరిగే గౌరవనీయ పురాతన ఛాయల్లారా! జోగొట్టండి. జోగొట్టండి! రెండులక్షలయేళ్ళ తరవాత యేం జరిగేదీ స్వప్నంలో జూస్తాం.

శేఖరం : రెండులక్షలయేళ్ళ తరవాత వుండేదేమిటి, శూన్యం!

వసంత్ : ఆ శూన్యమే చూద్దాం.

మాలతి : సరే-చూద్దాం. మేం నిద్దరపోతున్నాం !

[తెర యెత్తగా సరోవరదృశ్యం. దిఙ్మండలంమీద చంద్రుడు, నీటిలో చంద్రబింబం. తెల్లటిదుస్తుల్లో లీల పెద్ద రాతిబండమీద కూర్చుని వుంటుంది.]

లీల : మానవులు, సింహాలు, గరుడపక్షులు, కొంజుపిట్టలు, దుప్పులు, బాతులు, సాలిపురుగులు, చేపలు, వెలిగేచేపలు,

కంటికికనబడని జీవాలు, సమస్త జీవకోటీ, సమస్తజీవకోటీ, సమస్తజీవకోటీవిషాదవర్తులంగడిచి అంతరించిపోయాయ్... యీభూమిమ్మీదప్రాణి అంటూ కనిపించి వేలకువేల సంవత్సరాలైంది. పాపం! యీ చంద్రుడు వృథాగా తన వెలుగు వొలకబోస్తున్నాడు. పచ్చిక బయళ్ళమీద కొంగలు అరుస్తూ మేల్కొవడం లేదు. నిమ్మతోటల్లో కుమ్మరి పురుగులు అరవడంలేదు. చలి! చలి! చలి! శూన్యం! శూన్య! శూన్యం! ఘోరం! ఘోరం! ఘోరం! (విరామం) జీవరాసులకంకాళాలు మట్టిలో కలిసిపోయాయ్. అనంతప్రకృతి వాటిని రాళ్ళగా, నీరుగ, నుబ్బులుగామార్చేసింది. వాటి ఆత్మలన్నీ వొకటిగా ఐక్యమైపోయాయ్. విశ్వాత్మ... నేనే... నేనే... విక్రమార్కుని ఆత్మ, చంద్రగుప్తుని ఆత్మ, కాళిదాసు ఆత్మ, శివాజీ ఆత్మ, అత్యల్పమైవ జలగ ఆత్మ, నా ఆత్మలో ఐక్యమైపోయాయ్. నాలో మానవుల అంతరాత్మలూ, మృగాల ప్రవృత్తులూ మిళితమైనాయ్. ప్రతీదీ, ప్రతీదీ నాకు జ్ఞాపకమే. ప్రతి జీవితం నాలో తిరిగి అనుభవిస్తున్నాను. (ప్రమిద దీపాలు కనిపిస్తాయి.)

మాలతి : (నెమ్మదిగా) కుక్కమూతి పిందెలు!

వసంత్ : (ప్రార్థనా పూర్వకంగానూ చివాట్లు పెట్టుతున్నట్లూ) అమ్మా!

లీల : నేను యేకాకిని. శతాబ్దానికోమారు మాట్లాడాలని పెదవి కదల్చుతా. ఈ శూన్యంలోనా స్వరం శోకాకులంగా మోగుతుంది. యెవరూ వినరు... మసకమసకలాడే మబ్బ

ల్లారా! మీరు నన్ను లక్ష్యపెట్టరు...ఉదయం మురుగులో పుట్టి, పుట్టడానికిపూర్వం ఆలోచనాశక్తి లేకుండా, యిచ్ఛాశక్తి లేకుండా, జీవం లేకుండా మీలో ప్రాణం ఆవిర్భవిస్తుందనే భయంతో తిరుగుతారు. అనంత ప్రకృతి సృష్టించిన పెనుభూతం అనుక్షణమూ మీలో రాళ్ళలోలాగా నీళ్ళలోలాగా పరమాణు పరివర్తన జరుపుతోంది. మీరు యెడతెగకుండా మారిపోతున్నారు. విశ్వంలో ఆత్మవొక్కటే శాశ్వతం, నిర్వికల్పం. (ఆగి) లోతునూతిలో పడవేసిన ఖైదీలా నే నెక్కడున్నానో, యేం జరగనుందో నాకే తెలీదు. భౌతికశక్తి సిద్ధాంత మహాభూతంతో భీషణ పోరాటంలో నాకే విజయమని తెలుసు. ఆ తరవాత ప్రకృతి, ఆత్మ సంపూర్ణంగా మిళితమై పోతాయ్. విశ్వ యిచ్ఛాశక్తి పరిపాలన అప్పుడు ప్రారంభమవుతుంది. కాని యిదంతా కొంచెం కొంచెంగా కోట్ల సంవత్సరాల పరంపర తరవాత చంద్రుడూ, కుజుడూ, భూమీ మట్టిలో కలిసినాక సంభవిస్తుంది... అప్పటివరకూ—భయోత్పాతం! భయోత్పాతం! (విరామం. సరోవరంమీద రెండు ఎఱ్ఱటి చుక్కలు కనిపిస్తాయి.) అదుగో! నా పరమశత్రువు పెనుభూతం. అవిగో భయంకర నేత్రవిస్ఫులింగాలు...

మాలతి : గంధకం వాసన కొడుతోంది. యిది కూడా అవసరమేనా?

వసంత్ : ఆ—

మాలతి : ఔను— బలే భావముద్ర.

వసంత్ : అమ్మా!

శీల: మానవుడంటూ కన్పించక విసిగెత్తి పోయాడు...

సుశీల: (శర్మతో) హాటు తీసేశావేం? పెట్టుకో, లేకపోతే జలుబు చేస్తుంది.

మాలతి: అనంత ప్రకృతి స్రష్ట ఆ పెనుభూతం గౌరవార్థం శాస్త్రిగారు హాటు తీసేశారు.

వసంత్: (మండిపడి, బిగ్గరగా) నాటకం ఆఖరైంది. ఆపు! తెర!

మాలతి: యెందుకంత కోపం?

వసంత్: ఆగు... తెర! తెరదింపు. (కాలితో నేలపై తన్నుతూ) తెర! (తెరపడుతుంది) కొద్దిమందే నాటకాలు రాయగలరనీ, కొద్దిమందే నటించగలరనీ మర్చిపోయాను. అతిక్రమణచేశా. నాకు... నేను(ఏదో చెప్పాలని యత్నించి చేయివిసిరి ఎడమవైపుకు వెళ్ళిపోతాడు)

మాలతి: యేమిటి సంగతి?

శేఖరం: మాలతీ! భవితవ్యంమీద యెంతో ఆశపెట్టుకున్న యువకుణ్ణిలా నిరాదరించవచ్చా?

మాలతి: నేనేమన్నానూ?

శేఖరం: వాడి మనసు నొప్పించావ్.

మాలతి: నాటకమంతా వో ప్రహసనమని ముందే నాకు హెచ్చరించాడు. అలాగే నేనూ పరిగణించాను.

శేఖరం: అయినా—

మాలతి: గొప్ప నాటకం రాశాడని యిప్పుడు అవగత మవుతోంది! ఆలోచించు! ఈ ప్రదర్శనం యేర్పాటు చేసి

గంధకం పొగతో మన్ని కప్పేశాడు. పరిహాసంగా కాదు- అసమ్మతిగా ... నాటకాలు యెలా రాయాలో యెలా నటించాలో మనకి పాఠాలు చెప్పజూచాడు పాపం! చివరికి విసిగొత్తింది. యేమన్నా అను-యెద తెరిపిలేకుండా ఈ పేలాపనా, యీ యెత్తిపొడుపులూ యెవరికైనా విసుగెత్తిస్తాయ్. నిలకడలేని స్వార్థపరుడు!

శేఖరం: నిను సంతోష పెట్టాలనుకున్నాడు. అంతే...

మాలతి: అలాగేం? మామూలు నాటకం యెదోగాకుండా ఈకుక్క-మూతి గోలవినిపించాడు. పరియాచకానికి గోలైనా వింటాగాని నూత్న రూపాలు, కళాప్రపంచంలో నూత్న యుగం అని వేషాలు వేస్తే! ఇందుల్లో నూత్న రూపాలేం లేవు. దుస్స్వభావం మాత్రం వుంది.

ప్రకాశ్: యెవరైనా తన కోరికలూ, శక్తీ అనుసరించి వ్రాస్తారు.

మాలతి: వారి కోర్కెలూ, శక్తీ అనుసరించే రాయమను! మనల్నిమట్టుకు వదిలిపెడితేచాలు.

శర్మ: గురుడా! కోపంవచ్చిందా...

మాలతి: నేనేం గురుణ్ణికాను. తారను. నాకుకోపంలేదు. కుర్రాడు ఇంత తెలివితక్కువగాకాలం వృథాబుచ్చుతున్నాడే అని బాధపడుతున్నా. వాణ్ణి నొప్పించాలని నాకేం లేదు.

సూర్యం: ప్రకృతినుంచి ఆత్మను వేరుచేయటానికి సాధనాలు లేవు. ఆత్మే భౌతికపరమాణువుల సమ్మేళనం కావొచ్చు.

(ప్రకాశ్‌తో ఉల్లాసంగా) యెవరైనా నాటకంలో మా బడిపంతుళ్ళ జీవితం వర్ణించి ప్రదర్శిస్తేనా! కష్టమయ జీవితం! కష్టమయ జీవితం!

మాలతి: సరే, నాటకాల గురించీ, అణువులగురించీ యిక చాలు. యెంత దివ్యమైన సాయంకాలం! విను, యెవరో పాడుతున్నట్టున్నారు. (విని) యెంత బాగుంది!

సుశీల: అవతలపక్కన పాడుతున్నారు.

మాలతి: (ప్రకాశ్‌తో) నాపక్కన కూర్చో. పదిపదిహేనేళ్ళ కితం ప్రతిరాత్రీ యీ సరోవరంమీద సంగీతం, పాటలు యెడతెగకుండా వినిపించేవి. యీ సరస్సుచుట్టూ ఆరు జమీలుండేవి. నవ్వులు, గోల, వేట, ప్రేమకలాపం ఇంకా జ్ఞాపకమున్నాయ్... యీ ఆరు జమీలలో ప్రధానపురుషుడూ, ఆదర్శపురుషుడూ, యిదుగో (శర్మకేసి తలతిప్పి) డాక్టర్ శర్మ యిప్పటికీ మనోహరంగా వున్నాడు. అప్పుడు యీయనకు మెరుగంటూవుందా? అయినా నా అంతరాత్మ బాధిస్తోంది. నా పసికందును యెందుకు నొప్పించాను, దేవుడా! నాకేం తోచడంలేదు. (బిగ్గరగా) వసంత్! బాబూ! వసంత్!

రాజ్యం: వెళ్ళి తీసుకొస్తా.

మాలతి: వెళ్ళమ్మా, వెళ్ళు. వెళ్ళితీసుకురా

రాజ్యం: (యెడకు వైపుకు వెడుతూ) వసంత్! (వెతుకుతుంది)

లీల: (ప్లాట్ఫారం వెనకనించి ముందుకు వచ్చి) యిక నాటకం సాగేటట్టు లేదు, బైటపడతా. యెలా వున్నారు బాగున్నారా?

శేఖరం : బలే ! బలే !

మాలతి : బలే ! బలే ! ఎంతగా మెచ్చుకున్నా మనుకున్నా ! యింత చక్కని రూపం, యింత అద్భుతమైన గొంతు పల్లెటూళ్ళల్లో పడుండడం, ఘోరం ! ప్రతిభ వుండాలి, స్టేజీ యెక్కాలి.

లీల : అదే నా స్వప్నం. (నిట్టూర్చి) కానీ అదెన్నటికీ సిద్ధిం చేది కాదు.

మాలతి : యెవరు చెప్పగలరు ? యిదిగో – నీకు పరిచయం చేస్తా ప్రకాశ్.

లీల : సంతోషం. సంతోషం... (సిగ్గు) ఎప్పుడూ మీ రచ నలు చదువుతూవుంటా.

మాలతి : (తన పక్కన చోటిస్తూ) సిగ్గెందుకు ? ప్రఖ్యాత పురుషుడు. అమాయకుడు ! చూడూ, యెలా సిగ్గు పడు తున్నాడో !

శర్మ : యిక తెర యెత్తచ్చనుకుంటా, వికారంగావుంది.

రాము : (సిగ్గుగా) హాలాయ్ ! తెరెత్తు. (తెర పైకి వెడుతుంది)

లీల : (ప్రకాశ్ తో) యిది విచిత్రమైన నాటకం కదూ ?

ప్రకాశ్ : నాకేం అర్థంకాలా. అయినా ఆనందించా. నువ్వ సహజంగా అభినయించావ్. సీనరీ అద్భుతంగా వుంది. (ఆగి) యీ సరోవరంలో చాలా చేపలున్నాయనుకుంటా.

లీల : ఆ–

ప్రకాశ్ : నాకు చేపలవేటంటే మహాయిష్టం. మనవాళ్ళేమో చేపలు పట్టటం వరువు తక్కువంటారుగాని దొరల్ని చూడండి, యెంత గొప్పవాడైనా సరే, సర్దాకి గాలం

పుచ్చుకుని కాలక్షేపం చేస్తాను. కనుచీకట్లో వొడ్డునకూర్చుని వలకేసి చూట్టంకంటే నా కానందం వేరేలేదు.

లీల : కల్పనలలో ఆనందం అనుభవించే వాళ్ళకి తక్కిన ఆనందాల ఉనికే తెలీదంటారుగా !

మాలతి : (నవ్వుతూ) అలా ఆయనతో మాట్లాడకూడదు. దయతో మాటాడితే ఆయనకేం పాలుపోదు.

రామ : ఒకొప్పుడు సుప్రసిద్ధుడైన శాస్త్రి వో నాటకంలో గాంధారంలో పద్యం యెత్తుకున్నాడు. ఆ సమయంలో హాల్లోకూర్చున్న కల్యాణబత్తుడొకడు హఠాత్తుగా–మేంపడ్డ పరమానందం ఊహించుకో – బలేశాస్త్రి అని మంద్రంలో ఇలా (మంద్రస్వరంలో) 'బలేశాస్త్రి'... అంతా డంగై పోయారు. (విరామం)

శర్మ : మౌనదేవత మన చుట్టూ తిరుగుతోంది !

లీల : వెళ్ళే వేళైంది. శెలవు.

మాలతి : యెక్కడికి ? అప్పుడే యెక్కడికెడ్తా. ఉహుఁ— నిన్ను వెళ్ళనీయం.

లీల : నాన్న కాచుకుని వుంటాడు.

మాలతి : అదేం రోగం ! సరే – వెళ్ళక తప్పదన్నమాట. వెళ్ళనీయటం ఘోరం ! ఘోరం !

లీల : వెళ్ళిపోవటం నాకెంత కష్టంగావుందో మీకు తెలిస్తేనా ?

మాలతి : యింటిదాకా యెవర్నైనా వెంటబెట్టుకుని వెడితే మంచిది.

లీల : (భయంతో) ఉహూఁ-వద్దు-వద్దు

శేఖరం : (బతిమాలుతూ) లీలా ! వుండిపోరాదూ.

లీల : వుండలేను. శేఖరం తాతా!

శేఖరం : పోనీ యింకో గంటవుండి మరీవెళ్ళు.

లీల : (ఆలోచించి కన్నీళ్ళతో) అసంభవం ! (తొందరగా వెళ్ళిపోతుంది)

మాలతి : యెంత దురదృష్టవంతురాలు ! చచ్చిపోయిన వీళ్ళమ్మ చిల్లపెంకుతోసహా ఆస్తంతా మొగుడుపేర రాసిచ్చింది. ఆయనగారదంతా రెండో పెళ్ళానికి సమర్పించాడు. యిప్పుడు పాపం! యీ పిల్లకు చిల్లిగవ్వన్నా లేదు. ఘోరం! ఘోరం!

శర్మ : వాళ్ళ నాన్న శుద్ధపశువు.

శేఖరం : (చేతులు రుద్దుకుంటూ) లోపలికి పోదాం పదండి. చెమ్మగా వుంది. పైగా నా కాళ్లు నెప్పులు పుడుతున్నాయ్.

మాలతి : నీ కాళ్లు కొయ్యతో చేసినట్టున్నారు. కదలనేకదలవ్! సరే - లోపలికి వెడదాం పదండి.

శేఖరం : కుక్క మొరుగు మళ్లా వినిపిస్తోంది. (రామనాధంతో) రామనాధం ! కుక్క గొలుసు వూడదీయించు.

రామ : వల్లగాదు. ధాన్యపు కొట్టులోకి దొంగ దూరచ్చు, జొన్నలున్నాయ్. (పక్కనే నడుస్తున్న సూర్యంతో) ఆ-మంద్రంలో 'బలేశాస్త్రి' అందులోనూ పాటగాడు కాడు అన్నది మేళగాడు.

సూర్యం : మేళగాడికి జీతమెంత? (శర్మతప్ప తక్కినవారంతా వెళ్ళిపోతారు.)

శర్మ : (స్వగతం) నాకేం తెలీటంలేదు. యేమీ అర్థం కావటంలేదా? మనస్సు మనసులో లేదా? కాని నాటకం బాగుంది. దాంట్లో యేదో విశేషం వుంది. ఆ బాలిక వొంటరితనం గురించి మాట్లాడుతూంటే, ఆ పెనుభూతం కళ్ళు కనిపించేసరికే ఆందోళనతో నా చేతులు వణికాయి. నవీనంగా, స్వాభావికంగా వుంది ... అడుగో, అతనే వస్తున్నట్లున్నాడు. యెంతో మంచిగా మాట్లాడాలనివుంది.

వసంత్ : (ప్రవేశించి) యిక్కడెవరూ లేరా?

శర్మ : నేనున్నా.

వసంత్ : రాజ్యం నాకోసం తోటంతా వెదుకుతోంది. మడ్డి మృగం!

శర్మ : వసంత్! నీ నాటకం మహా బాగుంది. యిది సాధారణ నాటకంగాదు. చివరదాకా వినలేదుగాని నా హృదయంలో గాఢంగా హత్తుకుంది. నీవు తెలివిగలవాడివి. రచనలు యింకా సాగించాలి. (వసంత్ సంతోషంతో గట్టిగా శర్మను కావలించుకుంటాడు)

శర్మ : అరె! అరె! యేమిటా వుద్వేగం! కన్నీళ్లు! వూహాప్రవంచంనుంచి వస్తువు యేరుకున్నావని చెప్పదలచా అంతే. అలానే యేరుకోవాలి. కళ గొప్పభావాలు వెల్లడించాలి. గంభీరమైందే సౌందర్యోపేతమైంది. తెల్లబోతున్నావేం?

వసంత్ : అలానా – కానీ.

శర్మ : నిజం...ప్రధానమైందీ, శాశ్వతమైందీ మాత్రమే ప్రవర్తించు. నాకు వివిధ అనుభవాలున్నాయ్. వాటిలో ఆనందమూ పొందాను, తృప్తిపడ్డా. కల్పనాసమయంలో అనుభవించే ఆత్మోన్నత్యం అనుభవించగల్గితే యీ భౌతికశరీరాన్నీ, అసాధారణంగా దానితో కూడిన వాటినీ యీవగించుకుని యీ భూమికి దూరదూరంగా యెగిరిపోతాననుకుంటా.

వసంత్ : లీలయేదీ ?

శర్మ : రచనలలో యింకా నిర్మలమూ, విస్పష్టమూ అయిన భావముండాలి. రచనోద్దేశం తెలుసుండాలి. నిర్దిష్టఆశయం లేకుండా సౌందర్యమార్గం అనుసరిస్తే మార్గం తప్పిపోతావ్. నీ ప్రతిభే నిన్ను నాశనం చేస్తుంది.

వసంత్ : (ఆదుర్దాగా) లీల యేదీ?

శర్మ : యింటికి వెళ్ళిపోయింది.

వసంత్ : (నిరాశతో) యేం చెయ్యను? ఆమెని చూడాలనివుంది... చూచితీరాలి... నేనూ బయలుదేర్తే! (రాజ్యం ప్రవేశం)

శర్మ : (వసంత్ తో) మిత్రమా! నిదానించు.

వసంత్ : ఊహూఁ వెళ్తాను. వెళ్ళితీరాలి.

రాజ్యం : యింటోకి వెళ్ళు వసంత్! మీ అమ్మ నీ కోసం నిరీక్షిస్తోంది. ఆదుర్దా పడుతోంది.

వసంత్ : నేను వెళ్ళిపోయానని చెప్పి. నను వొంటరిగా వదలండి. ప్రార్థిస్తున్నా. నన్ననుసరించి రాకండి.

శర్మ : రా, రా, రా...అలా వెళ్ళకూడదు. అదంత మంచి పనిగాదు.

వసంత్ : (కన్నీళ్ళతో) శెలవుడాక్టర్! కృతజ్ఞణ్ణి. (నిష్క్రమణ)

శర్మ : (నిట్టూర్చి) ఓ యువకులు! యువకులు!

రాజ్యం : యేమంటానికీ తోచకపోతే 'యువకులు! యువకులు!' అని అనడం ప్రజలకు మామూలై పోయింది!

శర్మ : యింట్లో యెవరో పాడుతున్నారనుకుంటా. లోపలికి వెళ్ళడం మంచిది.

రాజ్యం : కాస్సేపు ఆగుదురు?

శర్మ : యెందుకూ?

రాజ్యం : యింకోమాటు చెప్పాలని వుంది. చెప్పాలనివుంది... (ఆందోళనతో) నా తండ్రిమీాద నాకు ప్రేమలేదు... నా హృదయం విప్పి చెప్తాతా... యెందుకో మీారు నా తండ్రి వంటవారని హృదయ పూర్వకంగా భావిస్తున్నా... సహాయం చేయండి... సహాయం చేయండి ... లేకపోతే యేదో తెలివి తక్కువ పని చేసూరుకుంటా... జీవితమంతా తారుమారు చేసుకొని నాశన మవుతా... యిక భరించ లేను.

శర్మ : యే విధంగా సహాయం చేయను?

రాజ్యం : నేను బాధపడుతున్నా. యెవరికీ, యెవరికీ నా బాధ తెలీదు. (శర్మ ఎదురు బొమ్మమీద తల వాల్చి నెమ్మదిగా) వసంత్ ని ప్రేమిస్తున్నా.

శర్మ : యేమిటీ వుద్వేగం! యేమిటీ వుద్వేగం! యెంత గాఢ ప్రేమ!... ఓ సమ్మోహిత సరోవరమా! (దయతో) నన్నేం చెయ్యమంటావ్, బిడ్డా! యేం చెయ్యమంటావ్? యేం చెయ్యమంటావ్!

[ తెర ]

# రెండో అంకం

[ క్రీడావనం. వెనక దూరంగా కుడిపక్కన విశాలమైన షాబాయిల్లు. ఎడమవైపున సరోవరం. సూర్యుడు అందులో ప్రతిబింబిస్తూ వెలుగుతున్నాడు. పూలమళ్ళు. మధ్యాహ్నం వేడిగావుంది. క్రీడావనం పక్కన ముసిలి నిమ్మచెట్టు కింద మాలతి, శర్మ, రాజ్యం బెంచిమీద కూర్చొనివున్నారు. శర్మ ఒడిలో తెరిచిన పుస్తకం వుంటుంది ]

మాలతి : (రాజ్యంతో) యిక నిలబడదాం (యిద్దరూ లేస్తారు) పక్క-పక్కన నుంచుందాం. నీకు యిరవై రెండేంళ్ళు, నాకు అంతకు రెట్టింపు. శర్మా! యెవరం చిన్నదానిలా కన్పిస్తున్నామో చెప్పు?

శర్మ : నిస్సందేహంగా నువ్వే మాలతీ!

మాలతి : చూడు... యెందుకు చిన్నదానిలా కనిపిస్తున్నానో తెలుసా? యెందుకంటే-నేను కష్టపడి పనిజేస్తా. ఎప్పుడో యేదో ఒకటి చేస్తూనే వుంటా. గోళ్ళు గిళ్ళుకుంటూ కూర్చోను. యిక నువ్వో - కూర్చున్న చోటునుంచి కదలనే కదలవ్ చురుకుగా వుండనే వుండవ్. భవిష్యత్తును గురించి ఆలోచించకూడదని నియమం పెట్టుకున్నా.

వృద్ధాప్యం గురించిగానీ మరణం గురించిగానీ యెన్నడూ ఆలోచించను. యేం జరగాల్సివుంటే అదే జరుగుతుంది.

రాజ్యం : యిక నాకో, యెన్నడో యుగాల క్రితం పుట్టా ననిపిస్తుంది. అంతులేని రైలులాగా యెలాగో జీవితం గడుపుతున్నా... తరచు ముందుకు సాగాలనే వుండదు. (కూర్చుని) పోనీ. యిదంతా చిత్తభ్రమ. పోర్చ్ జాడించుకొని దులిపేసుకోవాలి.

శర్మ : (మెల్లగా కూనిరాగంతో)

"పూవుల్లారా చెప్పండామెతో"

మాలతి : యింకా-యింగ్లీషు వాళ్ళలా నియమాలు పాటిస్తూ వుంటా. గొప్పగా రోజులు గడుపుతా. సుబ్బరంగా బట్టలు వేసుకుంటా. పసందుగా తల దువ్వుకుంటా. బ్లౌజు వేసుకునిగానీ, తల దువ్వుకోకుండా గాని, బయటికి యీ తోట వరకైనా వెడతానని కలలోనైనా అనుకోను. అలా యెన్నడూ వెళ్ళనే వెళ్ళను. బట్టలు వేసుకోటంలో అశ్రద్ధ చేయను. అందుకనే చక్కగా వుంటా. మందకొడితనం అలవాటు కానీను. (నడుంమీద చేయులు వేసుకొని క్రీడా వనంలోకి వెడుతూ) చూచావా - గజ్జెల కోడిలా యెంత చురుగ్గా వున్నానో - పదిహేనేళ్ల బాలిక లాగా నటించ గలను.

శర్మ : బాగుంది. అయినా చదువుకు పోతా. (పుస్తకం తీసుకుని) యెక్కడ ఆపాం? ధాన్యం వర్తకుడు. యెలకలు.

మాలతి : యెలకలు... యిదిగో... (చదువుతూ) నవలా కారులను పోషిస్తూ వారిని వలలో వేసుకుందామని సంఘానికి

కట్టుబడ్డవారు చూడడం గిడ్డంగిలో ధాన్యపు వర్తకుడు యెలకల్ని పెంచడం వంటిదని సుస్పష్టం. అయినా వారి వెంటబడతారు. రచయితను వలలో వేసుకోవాలని స్త్రీ అతణ్ణి అభినందనాలతో, పొగడ్తలతో, వుపకారాలతో చుట్టుముట్టుతుంది. సరే–యిదంతా ప్రొంచివాళ్ళకి వర్తిస్తుం దేమోగాని మన విషయంలో అటువంటి దేంలేదు! కార్యక్రమమంటూ లేదు. రచయితను వలలో వేసుకోవాలని తలిస్తించక ముందే మనలో ఆడది తలవరకూ ప్రేమలో మునిగి పోవడం తథ్యం. అంతదూర మెందుకూ నన్నూ, ప్రకాశ్ నీ చూడు.

(శేఖరం కర్ర కానుకుని, లీలా పక్క పక్కనే నడుస్తూ సూర్యం కుర్చీ తోసుకుంటూ ప్రవేశం)

శేఖరం: (పిల్లలతో మాట్లాడే స్వరంతో) ఆ...శుభవార్త! యివ్వాళ కులాసాచిక్కింది. యిదీ అసలుసంగతి. (మాలతితో) శుభవార్త! వాళ్ళనాన్నా, సవత్తల్లీ బొంబాయి వెళ్లారు.

లీల: (మాలతి ప్రక్కన కూర్చుని కావలించుకుంటూ నాకు నిజంగా సంతోషంగా వుంది. యిక నే సేదాన్ని.

శేఖరం: (కుర్చీమీద కూర్చుని) యివాళ లీల ముద్దొస్తోంది.

మాలతి: నీటుగా బట్టలువేసుకున్నావ్. ఆకర్షణీయంగా... ఆ... యిప్పుడు మంచి తెలివైన్దానివి. (లీలను ముద్దు పెట్టుకుంటూ) దిష్టి కొడుతుంది జాగ్రత్త. ప్రకాశ్ యేడీ?

లీల: స్నానాల గదిలో చేవలు పడుతున్నాడు.

మాలతి : విసుగెత్తకుండా యెలా వుందబ్బా ! (చదవ బోతుంది)

లీల : యేవిటి చదువుతున్నారు ?

మాలతి : యేదో నవల (కొన్ని పంక్తులు తనలో తాను చదువుతుంది) మిగతాది కౌతుకమూ పుట్టించదు, నిజమూ కాదు. (పుస్తకం మూసేసి) మనస్సేం బాగుండలే, మా అబ్బాయి సంగతేమిటి ? యెంతో అలసిపోయినట్లు, విచారంగా వున్నట్లు కనిపిస్తాడు. రోజులకి రోజులు సరోవరం మీదే గడుపుతున్నాడు. కంటికి కనిపించనే కనిపించడం లేదు.

రాజ్యం : పాపం ! కుంగిపోయాడు. (లీలతో భయంతో) అతని నాటకం నుంచి కాస్త చదువుదూ.

లీల : (బుజాలు యెగరవేస్తూ) చదవమంటారా ? మనోరంజకంగా వుంటుందా ?

రాజ్యం : (సంతోషం ఆపుకుంటూ) అతనే స్వయంగా చదువుతూంటే కళ్లు మెరుస్తాయి. ముఖం పాలిపోతుంది. గొంతు అందంగా విచారంగా వినిపిస్తుంది. కవిలాగా కనిపిస్తాడు.

శేఖరం గురక వినిపిస్తుంది)

శర్మ : గుడ్ నైట్ !

మాలతి : శేఖరం !

శేఖరం : ఆ_

మాలతి : నిద్రా?

శేఖరం : అబ్బే! (విరామం)

మాలతి : వైద్యుల సలహా తీసుకోక పోవటం తప్పు.

శేఖరం: అదేవిటి? సలహా సంతోషంతో తీసుకుంటా. కాని యీ డాక్టరు సలహా యేమీ యివ్వటంలా.

శర్మ: అరవై యేళ్ళు వచ్చినాక యింకా మందు లేమిటి?

శేఖరం: అరవై యేళ్ళు వచ్చినా బతికుండాలనే వుంటోంది.

శర్మ: (చిరాకుగా) అయితే సిద్ధమకరధ్వజం పుచ్చుకో.

మాలతి: ఆరోగ్య స్థలానికి వెళ్ళగలిగేటంత సత్తువ నిస్తుందేమో?

శర్మ: యేమో, యివ్వనూవచ్చు, యివ్వకపోనూవచ్చు.

మాలతి: నిన్ను గ్రహించుకోవడమెలా?

శర్మ: గ్రహించడానికేముందీ, అంతా స్పష్టంగా కనిపిస్తూంటే. (విరామం)

సూర్యం: శేఖరంగారు చుట్టతాగడం మానెయ్యాలి.

శేఖర్: ఛత్!

శర్మ: అలాగాదోయ్, సారా, పొగాకు నీ వ్యక్తిత్వాన్ని నాశనం చేస్తున్నాయ్. ఓ చుట్టో, ఓగ్లాసు సారావో తాగాక నువ్వు శేఖరానివే కాదు. యెదో నిన్ను ఆవహిస్తుంది - ఉత్తమ పురుష నీలో కరిగిపోయి ప్రథమ పురుషలో తయారవుతుంది.

శేఖరం: (నవ్వుతూ) మాటలకేం, యెన్నైనా చెప్పొచ్చు. జీవితంలో సుఖం కావలసినంత అనుభవించావ్. మరి నేనో! కోర్టులో యిరవై యెనిమిదేళ్ళు పనిజేశా. కాని నా జీవితం యింకా ప్రారంభం కానేలేదు, యేమీ అనుభవించనూ లేదు. అదీ అసలు సంగతి. అందుకనే సహజంగా

జీవించాలని తెగకోరుకుంటున్నా. నీకేం, కడుపు నిండింది. అపేక్ష తీరింది. యెంతైనా వేదాంతం చెపుతావ్. నాకో యింకా బతకాలని వుంది. అందుకని సారా తాగుతా, చుట్ట తాగుతా. అంతే.

శర్మ: జీవితాన్ని గంభీరంగా పరిగణించాలి. అగ్గావై యేళ్ళు వచ్చాక మందూలు పుచ్చుకోవడం, పడుచు దనంలో తగినంతగా అనుభవించలేదని విచారపడటం వట్టి అవివేకం.

రాజ్యం: (లేచి) భోజనాలవేళైంది (నాజూగ్గా, నిర్లక్ష్యంగా నడుస్తూ) కాళ్ళు బిగుసుకు పోయాంయ్. (వెళ్ళిపోతుంది.)

శేఖరం: పాపం! సుఖమంటూ యేకోశానా లేదు!

శర్మ: పోనిద్దురూ వెధవగోడవ!

శేఖరం: నీకేం, నీది కడుపునిండిన బేరం!

మాలతి: యీ తియ్యటి గ్రామాలలోని విసుగుకంటె విసుగుంటుందా? పొద్దెక్కింది. అయినా యెవరూ యేమీ చేయడం లేదు. వేదాంతాలు చెబుతున్నారు. మీతో కలిసివుండటం, మీ మాటలు వినటం సర్దాగానే వుంటోంది గాని, ఓ... హోటలు గదిలో కూర్చుని పార్టీ వల్లె వేస్తుంటే యెంత బాగుంటుంది!

లీల: (ఆవేశంతో) యెంత బాగుంటుంది! నిన్ను అర్థం చేసుకున్నా.

శేఖరం: ఔను. పట్టణంలో యెంతో బాగుంటుంది. చదువుల గదిలో కూర్చోపెటటం, ముందుగా తెలియ జేయకుండా యెవరినీ బంట్రోతు రానీయకపోవటం – టెలిఫోను... వీధిలో రాకపోకలహడావుడి... అంతా...

శర్మ : (కూనిరాగంతో) "పూవుల్లారా చెప్పండామెతో"...

[రామనాథం, అతని భార్య సుశీల ప్రవేశం]

రామ : యిదుగో, సుదినం! బాగున్నారా, సంతోషం, సంతోషం! (మాలతితో) యివాళ పట్నానికి మీరు వెళ్ళదలచారని నాభార్య చెప్పింది. ఔనా?

మాలతి : ఔను.

రామ : బలేబాగుంది. కాని అక్కడి కెలా చేరతారు, దొరసానీ! యివాళ ధాన్యం తోలుకువస్తున్నాం. కూలీలంతా పని చేస్తున్నారు. యే జతను కట్టమంటారు?

మాలతి : యే జతా! నాకేం తెలుస్తుంది?

శేఖరం : సవారీ యెద్లున్నాయిగా!

రామ : (ఆవేశంతో) సవారీ యెద్లా! మొదటి స్త్రీ లెక్కడ్నించి తేనూ? ఆశ్చర్యంగా వుంది. నా బుద్ధికేం అందడం లేదు. దొరసానీ, క్షమించు. మిమ్మల్ని పూజిస్తా. మీ కోసం నా ఆయుర్దాయంలో సగం ధారపోస్తా. అంతేగాని బండి మాత్రం కట్టలేను.

మాలతి : వెళ్ళి తీరాలి! నీ మాటలన్నీ మహా చిత్రంగా వున్నాయే.

రామ : దొరసానీ! జమీ వ్యవహారాలు మీకేం తెలుసు?

మాలతి : (మండిపడి) మళ్లీ పాతపాటే? అలాఅయితే యివాళే మద్రాసు వెళ్లిపోతా. కిరాయి బండి తీసుకురా. లేకపోతే నడిచేపోతా.

రామ : (మండిపడుతూ) అలాగైతే నా ఉద్యోగానికి రాజీనామా యిస్తున్నా. యింకోణ్ణి చూచుకోండి. (వెళ్ళిపోతాడు)

మాలతి : ప్రతి తడవా యింతే. ప్రతితడవా నాకిక్కడ అవ
మానమే దాపరిస్తోంది. యిక యిక్కడ అడుగు పెట్టను.
(యెడమవైపుకు వెళ్ళిపోతుంది. ఓనిమిషం తర్వాత
యింట్లోకి వెళ్ళడం కనిపిస్తుంది. ఆమె వెనక ప్రకాశ్ చేపలను
బట్టే కర్రలతో తప్పాలాతో వెడతాడు)
శేఖరం : (నుండిపడుతూ) పొగరుమోత్తనం? యేవిటో విసు
గెత్తుతోంది. అదీ అసలుసంగతి! యెడ్లన్నిటినీ యీ నిమి
షమే తోలుకురావాలి.
లీల : (సుశీలతో) ప్రఖ్యాతనటి మాలతీదేవిగారి కోరిక నిరాక
రించడమే. చలచిత్రమైనా ఆమెకోరిక జమీా అంతాకంటే
ప్రధానంకదూ ! యిలాంటిది కేవలం అసంభవం !
సుశీల : (నిరాశతో) యేంచెయ్యను ? నా స్థానంలో నువ్వు
న్నావనుకో ! యేంచెయ్యను ?
శేఖరం : (లీలతో) రా. చెల్లాయిదగ్గిరికిపోదాం. వెళ్ళిపోవద్దని
బతిమాలుకుందాం. అంతేగదూ ! (రామనాధంవెళ్ళిన
దిక్కు-చూస్తు) అనహ్యం ! పొగరుమోత్తనం !
లీల : (లేవనీకుండా) లేవొద్దు... మేం తీసుకువెడతాం.
(లీల, సూక్ష్యం తో పుడుకుర్చీ తోస్తూ) యేం విపరీతం!...
శేఖరం : ఔనౌను. విపరీతం!...కాని రాజీనామా పెట్టడు...
వెళ్ళగానే మాట్లాడతాగా.
(వెళ్ళిపోతారు. శర్మ, సుశీలా మాత్రం మిగిలారు)
శర్మ : అందరికీ విసుగెత్తింది. నిజానికి నీమొగుణ్ణి నడుంవిరిగే
టట్లు తన్ని పంపించాలి. యింతకీ మాలతి శేఖరం తమా
పణ కోరటం జరుగుతుంది. నువ్వేచూస్తావుగా.

సుశీల : నవారీ మెత్తనిగూడా పోలింపంపాడు. యిలాంటి జగడం రోజూజరుగుతూనేవుంది. యిది నాకెంతవ్యధ కల్గిస్తుందో నీకు తెలుస్తేనా? రోగిష్టి దాన్నయిపోతున్నా, చూడు. వణికి పోతున్నా ... యీమోటుతనం యిక భరించలేను. (ప్రార్థనాపూర్వకంగా) ప్రియుడా! ప్రియతమా! నన్ను తీసుకువెళ్ళిపో. కాలం గడిచిపోతోంది. మనమింకేం పడుచువాళ్ళంగాం. మనజీవితం చివరి రోజుల్లోనైనా రహస్యం, అసత్యం విడిచిపెట్టగలిగితేనా!

[ వి రా మ ం ]

శర్మ : నాకు యాభై యేళ్ళొవడి దాటింది. జీవితం మార్చుకునే కాలం దాటిపోయింది.

సుశీల : నాకు తెలుసు. నాతోనే కాకుండా యింకా చాలా మందితో నీకు సంబంధం వుంది. అందరినీ తీసుకుని వెళ్ళిపోవేమ్. నాకర్థమైంది. క్షమించు విసుగెత్తిస్తున్నా. (లీల పువ్వులుకోస్తూ యింటి సమీపంలో కనిపిస్తుంది.)

శర్మ : సరే – బాగుంది.

సుశీల : నా కసూయ జాస్తీ. ఔను. నువ్వు డాక్టరువి. ఆడ వాళ్ళను తప్పించుకోలేవ్. నాకర్థమైంది.

శర్మ : (చేరువకు వస్తున్న లీలతో) అక్కడ గొడవ యెలా వుంది ?

లీల : మాలతీదేవి యేడుస్తోంది. శేఖరం గారికి దగ్గు ప్రారంభమయింది.

శర్మ : యిద్దరికీ యింత సానటోజన్ యిస్తా.

లీల : (పూలు అందిస్తూ) దయచేసి వీటిని తీసుకోండి.

శర్మ : దయ! (యింటివైపు వెడతాడు)

సుశీల : (వెంట వెడుతూ) యెంత అందమైన పూలు! (ఇంటి సమీపంలో మందకొడిగా) ఆ పూవులియ్యి! ఆ పూవులియ్యి! (పూలు తీసుకుని చించిపారేస్తుంది. యిద్దరూ యింట్లోకి వెడతారు).

లీల : (స్వాగతం) సుప్రసిద్ధ నటీమణి, యింత చిన్న కారణానికి యేడవడం చిత్రంగా వుంది! ప్రజానీకం ప్రేమించే సుప్రసిద్ధ రచయిత-పత్రికలన్నీ ఆయన్ని గురించే రాస్తాయ్. ఫొటోలు విపరీతంగా అమ్ముడవుతాయ్. అతను గోజంతా చేపలు పట్టుకుంటూ గడపటం - రెండు చేపలు పడితే సంతోషించటం. చిత్రంగా లేదూ! సుప్రసిద్ధ పురుషులు గర్విష్ఠులనీ, యెవ్వరినీ దగ్గరకి రానీయరనీ, ప్రజలంటే అసహ్యించుకుంటారనీ అనుకునేదాన్ని. అన్నిటి కంటే పుట్టుకకూ డబ్బుకూ ప్రాధాన్యమిచ్చే ప్రజానీకంమీద పేరుప్రతిష్టలతో పగతీర్చుకుంటూ రనుకునేదాన్ని. కాని అందరికిమల్లే నే వారూ యేడుస్తారు. చేపలు బడతారు. పేకాడతారు. కోపగించు కుంటారు.

వసంత్ : (చాటులేకుండా తుపాకీతో చచ్చిన నీటికాకితో ప్రవేశం) వొంటరిగా వున్నావా?

లీల : వొంటరిగానే! (ప్రకాశ్ ఆమెపాదాలదగ్గిర నీటికాకిని పడవేస్తాడు) యేమిటది?

వసంత్ : యీ నీటికాకిని చంపేటంత నీచుణ్ణయినాని వేళ. నీ పాదాలవద్ద పడేస్తున్నా.

లీల: యేమిటీ వాలకం? (సిటికాకిని యెత్తిచూస్తుంది).

వసంత్: (కొంచెం ఆగి) యిలాగే నేనూ ఆత్మహత్య చేసుకుంటూ.

లీల: ఊ-పోదూ.

వసంత్: ఔను. నిన్ను నేను పొగడడం మానేసినాక ఎంతగానో మారిపోయావ్. శీతకన్నేశావ్. నే కనిపిస్తేనే చాలు, కలవర పడుతున్నావ్.

లీల: యీమధ్యనీకు కోపం యెక్కువైంది. యేమీ అర్థంగాని సాంకేతిక భాషలో మాట్లాడుతున్నావ్. యీ సిటికాకికూడా యేదో సాంకేతికమేనని స్పష్టమౌతోంది. క్షమించు నాకేమీ అర్థం కావడంలేదు. (సిటికాకిని కుర్చీమీద పెట్టి) నిను అర్థంచేసుకోలేనంతటి అమాయకురాల్ని.

వసంత్: ఆ నాటకం నాటి సాయంకాలంనుంచి వుదాసీనత ప్రారంభమైంది. నా నాటకంపూర్తిగా తగలబడిపోయింది. పరాజయం స్త్రీలు క్షమించలేరు. కాగితాలన్నీ తగలబెట్టివేశా. యెంత బాధపడుతున్నానో నీకు తెలిస్తేనా! యీ సరోవరం యెండిపోయినట్లు, భూమిలో మాయమైపోయినట్లు నిద్రలేవగానే కన్పించినంత ఘోరంగా, అసంభవంగా వుంది నీ వుదాసీనత. నువ్వు అమాయకురాలివని యిప్పుడే అన్నావు కదూ. కాని యిందులో అర్థంగాని దేముంది? నా నాటక మంటే నీకు యిష్టంలేదు. నా ఆశయం నిరసిస్తావ్. అప్పుడే నేనూ అందరిలాగానే సాధారణ మానవుణ్ణనీ, పనికిమాలిన మానవుణ్ణనీ తలుస్తు

న్నావ్ ...(కాలితో నేలతన్ని) నే నెంతగా బాగా గ్రహిం
చాను! యెంత బాగా గ్రహించాను! నా మెదడులో
మేకుపెట్టి కొట్టుతున్నట్టనిపిస్తోంది ... (పుస్తకం చదు
వుతూ ప్రవేశించే ప్రకాశ్‌ను గమనించి) ఇదుగో
యుదార ప్రతిభా సంపన్నుడు! గిరీశంలాగా వస్తున్నాడు!
అంధుగానూ పుస్తకంపట్టుకుని (వెకిలిరింతగా) "మాటలు,
మాటలు, మాటలు..." యింకా సూర్యుడు నీ దగ్గరికి
రానే లేదు. అప్పుడే మందహాసం చేస్తున్నావ్. సూర్య
కిరణాలకు వికసిస్తున్నట్లు కన్పిస్తున్నావ్. మీ దారికిఅడ్డు
రానులే (తొందరగా వెళ్ళిపోతాడు.)

ప్రకాశ: (నోటుపుస్తకంలో రాసుకుంటూ) "యెప్పుడూ
మాసిన దుస్తులే వేసుకుంటుంది. బడిపంతులు ఆమెని ప్రేమి
స్తున్నాడు."

లీల: బాగున్నవా, ప్రకాశ్!

ప్రకాశ: బాగున్నావా? పరిస్థితులు హఠాత్తుగా తారు
మారై యీవేళ వెళ్ళిపోతామనుకున్నా. మళ్ళీ కలుసు
కునే అవకాశంలేదు. ఘోరం! కౌతుకంపుట్టించే పడుచు
పిల్లల్ని తరుచు కలుసుకోను. పద్దెనిమిది పందొమ్మిది యేళ్ళ
పడుచులు యెలావుంటారో, యెలాప్రవర్తిస్తారో, మరిచే
బోయా. స్పష్టంగా చిత్రించుకోలేను. అందుకనే నా నవలల్లో,
కథల్లో పడుచుపిల్లలు సహజంగా వుండరు. వొక గంట
సేపైనా నీస్థానంలో వుండి నువ్వెలా ఆలోచిస్తావో, నువ్వె
లాంటిదానివో తెలిసికోవాలని వుంది.

లీల: నీస్థానంలో వుండాలని నాకూ వుంది.

ప్రకాశ్ : యెందుకూ ?

లీల : యెందుకా? సుప్రసిద్ధుడూ, మేధావంతుడూ అయిన రచయితయేలా భావిస్తాడో తెలుసుకోటానికి. నీకీర్తి నిన్నెలా మారుస్తోంది ?

ప్రకాశ్ : యెలానా? ఆలోచించాలి. యింతవరకుఆలోచించనే లేదు. (ఆలోచించి) యెదో ఒకటి. నాకీర్తిని నువ్వు అతిగా పొగడుతూ నైనావుండాలి. లేకపోతే కీర్తి నన్నేం మార్చటం లేకుండా నైనావుండాలి.

లీల : నిన్నుగురించి పత్రికల్లో చదువుకునే టప్పుడు ?

ప్రకాశ్ : పొగిడితే సంతోషిస్తాను. తిట్టితే రెండు మూడు రోజులం చిరాకుగా వుంటా.

లీల : విచిత్ర ప్రపంచం ? నువ్వంటే నా కెంత అసూయో నీకు తెలుసా ? ఎవరి అదృష్టం వారిది. కొంతమంది ఒకే మాదిరి జీవితం, విసుగు పుట్టించే జీవితం, ఏ మాగు మూలో సుఖంలేని జీవితం ఎలానో గడిపేస్తారు. మరి నీకులా లక్షకొకరికి రంజనకరం, మహోన్నతం, అమిత ప్రాముఖ్యం కల జీవితం లభిస్తుంది. నీకేం మహారాజువి.

ప్రకాశ్ : నేనా : (భుజాలు ఎగరవేసి) హుం... కీర్తి. సౌఖ్యం, మహోన్నత జీవితం, కౌతుకజీవితం అంటున్నావ్. ఈ చక్కటి మాటలు నాకేమో ఎన్నడూ రుచిచూడని "టర్కీభాత్" లా వుంటాయి. నువ్వుచిన్న దానివి. దయ గలదానివి.

లీల : నీది గొప్ప జీవితం!

ప్రకాశ్ : ఏమిటా గొప్ప ? (గడియారం చూస్తూ) తక్షణం
వెళ్ళి రాసుకోవాలి. క్షమించు. నాకు తీరిక లేదు...
(నవ్వుతూ) నా అభిమాన విషయం ఎత్తావ్. కొంచెం
చిరాకూ కోపం వస్తోంది. అయినా మాట్లాడుకుందాం.
నా మహోన్నత, మహోజ్వల జీవితం గురించి మాట్లాడు
కుందాం... సరే, సరే ఎక్కడ ఆరంభిద్దాం ? (ఆలోచించి)
కొన్ని భావాలు రాత్రింబగళ్ళు వెంటబడి ఆలోచించ
మంటాయి. నాకూ ఓ చంద్రుడున్నాడు. రాత్రింబగళ్ళు
ఒకే భావం నన్ను చుట్టుముట్టుతుంది. రాయాలి, రాయాలి,
రాయాలి. రాయాలి... ఒక పెద్దకథ రాయడం, ముగించ
గానే ఏదో విధంగా ఇంకోటి రాయాలి. తర్వాత మూడోది.
ఆ తర్వాత నాల్గోది... గబగబా ప్రయాణం చేస్తున్నట్లు
ఎడ తెగకుండా రాయాలి. రాయకుండా వుండనూ
లేను. ఇందులో యేం గొప్పతనం ? యేం కీర్తి వుంది ?
ఓ—యేం పిచ్చి జీవితం ? ఇక్కడ నీదగ్గర ఆవేశంతో
వున్నా, అయినా పూర్తికాని కథ నిరీక్షిస్తోందని
అనుక్షణం స్ఫురిస్తూనే వుంది. పియానోను పోలిన
మేఘం కన్పిస్తుంది. పియానోను పోలిన మేఘం తేలి
పోతున్నదని కథలో రాసితీరాలి. పొద్దుతిరుగుడు పువ్వు
వాసన కొట్టుతుంది. తక్షణం మనసులో నాటుకుంటాన్ని
ఘాటువాసన, వింత పుష్పం, వేసవి సాయంకాల వర్ణనలో
ఉదాహరించాలి. మనం మాట్లాడుకునే ప్రతిమాటా, ప్రతి
సమాసం పట్టుకుంటా. తక్షణం వాటిని నా సాహిత్య
భాండారంలో వేసి తాళం వేస్తా. ఎప్పటికైనా ఉపయో

గిస్తాయ్! పని ముగించుకొని, నాటకానికో చేపలవేటకో పరుగెత్తుతా. అక్కడ విశ్రాంతి తీసుకుందామని, నన్ను నేనే మర్చిపోదామని అనుకుంటా. కాని యేం ప్రయోజనం? తలలోబరువైన తుపాకీగుండు—కొత్తవస్తువు — సుళ్ళు తిరుగుతుంది. కలంపట్టి రాయాలి, రాయాలి. దీనికి అంతంటూ లేదు. విశ్రాంతీలేదు. నా జీవితం నేనే మింగుతున్నట్లని పిస్తుంది. ఇక శూన్యంలో ఎవరికో సేకరిస్తున్న తేనె కోసం నా ఉత్తమపుష్పాలనుంచి పుప్పొడితీసి, ఆపుష్పాలు కోసి వాటివేళ్ళు తొక్కేస్తున్నా. నేను పిచ్చివాణ్ణికానూ? నా మిత్రులూ, పరిచయస్తులూ స్వస్తులతో మెలిగేటట్లే నాతోనూ మెలుగుతారా? "ఇప్పుడేం రాస్తున్నావ్? ఏం అద్భుతం దాచిపెట్టావ్?" ఎప్పుడూ ఒకటే గొడవ. పరిచయస్తులు చూపే శ్రద్ధా పొగడ్తలూ, మెప్పులూ, వట్టిమోసం. రోగిలాగా నేనూ మోసపోతున్నా. వెనక నుంచి అకస్మాత్తుగా వచ్చి నన్ను పట్టుకొని పిచ్చిఆసుపత్రికి లాక్కుపోతారేమోనని భయంవేస్తుంది. నా యవ్వనంలో, మంచి రోజుల్లో, ఆరంభదశలో గ్రంథరచన ఎడతెగని బాధగా వుండేది. ప్రారంభదశలో అదృష్టం లేని రచయితకు జీవితం వికారంగా, భారంగా కన్పిస్తుంది. ఆవేశంతో చితికిపోయి నా హితుల్లో, కళలతో సంబంధంగలవారి వెంట బడతాడు. ఎవరూ గమనించరు. ఉపేక్షిస్తారు. పైసాలేని పక్కా జూదరిలా ప్రజలవంక తలెత్తి చూడలేడు. నా పాఠకుల్ని ఎన్నడూ అలా నేను చూడలేదు. కాని నా ఊహలో వారు మిత్రులూ విశ్వాసపాత్రులూ

కారనిపిస్తుంది. ప్రజానీకం అంటే నాకు భయం. నన్ను భయపెట్టారు కొత్త నాటకం ప్రచురించేటప్పుడు విద్యా విహీనులు శత్రువులుగా, జ్ఞానపరులు ఉదాసీనులుగా కన్పిస్తారు. యెంత ఘోరం? యెంత బాధ?

శీల: ఆవేశం, కల్పనాశ్రమం ఆనందం కల్గించవూ?

ప్రకాశ్: ఔను. నే రాస్తుంటే సంతోషంగానే వుంటుంది. ప్రూఫులు దిద్దడంకూడా సంతోషంగానే వుంటుంది. కాని ... పుస్తకం బైటికి రాగానే భరించలేను. సరిగా లేదనీ, పొరబడ్డాననీ, రాయకుండా వుంటేనే బాగుండేదనీ కురిస్తాను. విసిగిపోతాను. నాలోనేను కుంగిపోతాను ... (నవ్వుతూ) ప్రజలు చదువుతారు. "మనోహరంగా వుంది. నైపుణ్యం వుంది. కాని టాగూరుకి చాలదు" అంటారు. లేకపోతే "బాగుంది కాని శరత్ శ్రీకాంత్ ముందాగదు" అంటారు. ఇలా చచ్చిపోయే వరకూ నా రచనలు మనోహరం, మేధాసంపన్నం. మనోహరం, మేధాసంపన్నం. అంతే. పరిచయస్తులు నా సమాధి పక్కగా వెడుతూ "ఇదిగో ప్రకాశ్ సమాధి. మంచిరచయిత కాని శరత్ అంతబాగా రాయలేకపోయాడు" అంటారు.

శీల: క్షమించు. నిన్ను గ్రహించుకోలేను. విజయగర్వంతో పాడైపోయావు.

ప్రకాశ్: విజయం! విజయం నాకెప్పుడూ సరిపడదు. రచయితగానన్ను నేను ప్రేమించుకోను. ఏదో మైకంలోవుంటా. ఏం రాస్తున్నానో నాకర్థం కాదు ... ఇక్కడి నీళ్ళనూ, చెట్లనూ, ఆవేశాన్ని ప్రేమిస్తా. ప్రకృతికి సంచలిస్తా.

ప్రకృతి నాలో ఉద్రేకం రేపుతుంది, రాయాలనే అప్రతిహత వాంఛను రేపుతుంది. నేను దృశ్య చిత్రకారుణ్ణి మాత్రమే కాదు. పౌరుణ్ణి కూడా. నా దేశాన్నీ ప్రజల్నీ ప్రేమిస్తా. ప్రజలను గురించీ, వారి కష్టాలను గురించీ వారి భవిష్యత్తు గురించీ రాయాలనీ, శాస్త్రాలు గురించీ మానవ మహర్షులను గురించీ అవీ ఇవీ అన్నీ చెప్పాలనీ గుర్తించా. అన్నిటి గురించీ చెప్పాలంటే కాని, వ్యవధి లేదు. ఇవన్నీ నన్ను చుట్టుముట్టాయి. ప్రజలకు కోపం వస్తుంది. వేటకుక్కలు తరిమే నక్కలా అటూ ఇటూ పరుగెత్తుతా. జీవితం, శాస్త్రం ముందుకు. ఇంకా ముందుకు సాగిపోతున్నాయి. రైలు అందని రైతులా కాలం వెనకబడిపోతా. ప్రకృతి దృశ్యాలు మాత్రమే చిత్రించగలననీ, తక్కిన నా రచనల్లో కంచుకాగడాతో వెదికినా సత్యం లేదని గ్రహించగల్గాను

లీల : కష్టించి పని చేశావు. నీ ప్రాముఖ్యం గుర్తించుకోడానికి నీకు వ్యవధీ లేదు, కోరికా లేదు. నీకు తృప్తి లేకపోవచ్చు. కాని, తక్కినవారి దృష్టిలో నువ్వు గొప్పవాడివి. యశో భూషణుడివి. నేనే నీలాంటి రచయితనైతేనా, ప్రజానీకానికి నా జీవితం ధారబోసేదాన్ని. నా ప్రతిపత్తిని అందుకోవడంలోనే వారి సౌఖ్యం వుందనీ, నా రథానికి వారు తమను కట్టివేసుకుంటారనీ మర్చిపోను.

ప్రకాశ్ : రథం! యెందుకు నేనేం సైంధవుణ్ణా. (యిద్దరూ మందహాసం చేస్తారు)

లీల : రచయిత్రిని. నటిని అయ్యే సౌఖ్యంకోసం సన్నిహితుల వైముఖ్యం, దారిద్ర్యం, ఆశాభంగం సహించగల. చీకటి కొట్లో పడివుంటూ యింతగంజి తాగుతూ బతకగల. కాని కీర్తి, నిసర్గౌనకీర్తి, మాతృత్వమైనా కీర్తి కావాలి. (చేతులతో ముఖంకప్పుకొని) తలతిరుగుతోంది. ఓ...

మాలతి : (యింట్లోనుంచి) ప్రకాశ్ !

ప్రకాశ్ : పింఛపు వచ్చింది... సామాను సర్దుకోవడానికి వుండాలి. నాకు వెళ్ళిపోవాలని లేదు, (సరస్సు వంక చూస్తూ) యేం సౌందర్యం ! అద్భుతం !

లీల : అవతలి వైపున యిల్లు, తోటా కనిపిస్తున్నాయా ?

ప్రకాశ్ : ఆఁ—

లీల : అదే చచ్చిపోయిన మా అమ్మజమీ. నేనక్కడే పుట్టాను. జీవితమంతా యీసరోవరంచుట్టూ గడిపాను. అడుగడుగూ యెరుగున్నా.

ప్రకాశ్ : యెంతసౌందర్యం! (నీటికాకిని గమనించి) యిదేవిటి?

లీల : నీటికాకి—వసంత్ చంపాడు.

ప్రకాశ్ : అందమైనపక్షి! నిజంగా నాకు వెళ్ళిపోవాలని లేదు. మాలతీ దేవిని వుండమని పురిగొల్పు (నోటుపుస్తకంలో రాసుకుంటాడు.)

లీల : యేవిటి రాసుకుంటున్నారు ?

ప్రకాశ్ : గుర్తుకు రాసుకుంటూ వుంటా ... ఒకవిషయం నా హృదయంలో మెరిసింది. (నోటుపుస్తకం మూసేసి) చిన్నకథకు వస్తువు : ఒకసరోవరతీరం మీద నీలాంటి వయసుసుగత్తె బాల్యం నించీ నివసించింది. నీటికాకిలాగా

సరోవగాన్ని ప్రేమించింది. సంతోషంతో స్వేచ్ఛగా నీటికాకిలా కాలంగడిపింది. కాని హఠాత్తుగా ఓపురుషుడు వచ్చిచూచి, యీ నీటికాకిని నాశనం చేసినట్టే ఆమెనూ నాశనం చేస్తాడు. (విరామం)

(మాలతి కిటికీవద్ద కనిపిస్తుంది.)

మాలతి ; ప్రకాశ్ ! యెక్కడున్నా ?

ప్రకాశ్ : యిదిగో వచ్చే (వెళుతూ లీలకేసి తిరిగి చూస్తాడు కిటికీ దగ్గిరికి వెళ్ళి మాలతితో) యేవిటి ?

మాలతి : వుండి పోదాం.

(ప్రకాశ్ యింట్లోకి వెడతాడు)

లీల : (వడతల రంగంలో పాదాలదగ్గరగా వుండే దీపాలవద్దకు వచ్చి ఆలోచించి) స్వప్నం !

[తెర]

# మూడో అంకం

[శేఖరంయింట్లో భోజనాలగది. కుడిపక్కా, ఎడమ పక్కా గుమ్మాలు. పక్కనబల్లా, మందులబీరువా, గదిమధ్యలో బల్ల. ఒకట్రంకూ, హోల్డాలూ పెట్టుకొనే పెట్టె, ప్రయాణసన్నాహ చిహ్నాలు కన్పిస్తుంటాయి. ప్రకాశ్ పెండలాడే ఫలహారం చేస్తున్నాడు. బల్లపక్కన రాజ్యం నిలబడివుంది.]

రాజ్యం : నువురచయితవని నా సొదంతా వెళ్ళబోసుకుంటున్నా. యెప్పుడైనా యిదంతా వుపయోగించుకో. అంతస్సాక్షిగా చెబుతున్నా. వసంత్ తీవ్రంగా గాయపర్చుకుంటే వొక్కనిమిషమైనా యిక బతికుండను. యింకా సాహసం పోలేదు. నేనో నిశ్చయం చేసుకున్నా. హృదయంనించి యీ ప్రేమను పెకలించివేస్తా. వేళ్ళతో సహా పెకలించివేస్తా.

ప్రకాశ్ : యెలా ?

రాజ్యం : సూర్యాన్ని పెళ్ళిచేసుకుంటా.

ప్రకాశ్ : బడివంతుల్నా ?

రాజ్యం : ఔను.

పకాశ్ : యేమంత అవసర మొచ్చింది ?

రాజ్యం : మహాగాఢంగా ప్రేమించడానికీ, యెంగుకోసరమో సంవత్సరానికి సంవత్సరాలు నిరీక్షించడానికీ ... కాని పెళ్ళిచేసుకున్నాక ప్రేమను గురించి ఆలోచించడానికే వ్యవధివుండదు. యితర పనుల్లో మునిగిపోతా. తెలీదూ ? మార్పు? నువ్వు అమాయకుడివి. మనం విడిపోతున్నందుకు విచారిస్తున్నా.

ప్రకాశ్ : నామట్టుకునాకు వెళ్ళిపోవాలని లేదు.

రాజ్యం : ఆమెను వుండిపోయేట్టు చెయ్యి.

ప్రకాశ్ : ఉహుం ఈతడవ ఆగదు. ఆమెకొడుకు అతితెలివి తక్కువగా ప్రవర్తిస్తున్నాడు. మొట్టమొదట ఆత్మహత్య చేసుకోవాలని చూచాడు. యికయిప్పుడు ద్వంద్వ యుద్ధానికినన్ను సవాలు చేస్తానంటున్నాడట ! యెందుకో తెలుసా? బుసకొడుతూ నూత్నరూపాలుప్రబోధిస్తున్నాడు. కాని పాతవాటికీ కొత్తవాటికీ రెంటికీ స్థానంవుంది... బల వంతాన రుద్దడంలో అర్థమేముంది ?

రాజ్యం : అసూయకూడా వుంటుంది. అయినా నాకేంపట్టిందీ? (విరామం) (వాలాయ్ కుడివైపునించి ఎడమవైపుకు ట్రంకు పుచ్చుకుని వెడతాడు. కిటికీపక్కగా లీల ప్రవేశం)

రాజ్యం : మా బడిపంతులు పెద్దతెలివిగలవాడు కాదుకాని మంచివాడు. బీదవాడు. నన్ను అతిగాప్రేమిస్తున్నాడు. అతన్ని చూసినా, వాళ్ళముసిలి అమ్మనుచూసినా జాలేస్తుంది. సరే నీకు శుభం కలగాలి ! యెప్పుడైనా తల్చుకోండి. మీ స్నేహానికి యెంతో కృతజ్ఞురాల్ని. మీ పుస్త

కాలు మీా సంతకంతో వర్షింపచండి. 'అతిగా గౌరవించే'నిలా రాయక సరిగ్గా యిలా రాయండి "నామరూపాలు లేకుండా యెందుకు బతుకుతున్నదీ తెలీకుండా జీవించే రాజ్యానికీ తెలవు (వెళ్ళిపోతుంది)

లీల : (రాసిన పిడికిలి ప్రకాశ్ కి చూపుతూ) సరా బేశా?

ప్రకాశ్ : సరి.

లీల : (నిట్టూర్చి) నా చేతిలో నొక్క చింతపిక్క వుంది. స్టేజీ యెక్కడమూ మానటమూ అని కోరుకున్నా. యెవరైనా సలహా చెబితే బాగుండును.

ప్రకాశ్ : యిలాంటి విషయంలో యెవరూ సలహాయివ్వకూడదు. (విరామం)

లీల : విడిపోతున్నాం... బహుశా యికయెన్నటికీ కలుసుకోలేమో. జ్ఞాపకార్థం యీపతకం పుచ్చుకో. ఒకవైపున నీపేరు చెక్కించా... రెండోవైపున నీపుస్తకంపేరు 'రాత్రిం బగళ్ళు' అనిచెక్కించా.

ప్రకాశ్ : యెంత దివ్యంగావుంది! (పతకం ముద్దిడుకుని) మనోహరం!

లీల : యెప్పుడైనా నన్ను తలుచుకో.

ప్రకాశ్ : నిన్ను మర్చిపోతానా లీలా! వారం కితం నిత్యమూ మనం కబుర్లు చెప్పుకున్నాం జ్ఞాపకముందా? సీటికాకి బల్లమీాద పడివుంది. నస్నటిదుస్తులు ధరించి వున్నావ్. ఆనాటి నీ సుందరరూపం జ్ఞాపకముంచుకుంటా.

లీల : ఔను. సీటికాకి! (ఆగి) యిక మాట్లాడుకోలేం. యెవరో వస్తున్నారు ... వెళ్ళిపోయేముందు రెండు నిమి

పాలు... ఇదీ నా విన్నపం. (ఎడమవైపున నిష్క్రమించి. అదే సమయంలో కుడివైపునుంచి నక్షత్రంలాంటి పతకం గుచ్చిన డిన్నర్ జాకెట్టు తొడుక్కుని, మాలతీ. శేఖరం ప్రవేశం. వాలాయ్ సామాను సర్దుకుంటాడు.)

మాలతి : నీకు వృద్ధాప్యం వచ్చేసింది. యిక యింటిదగ్గరే వుండిపోవడమే మంచిది. కళ్ళనొప్పులతో వాళ్ళనీ వీళ్ళనీ చూట్టానికి తిరగలేవ్. (ప్రకాశ్ తో) యిప్పుడిలా వెళ్ళిం దెవరు? లీలా?

ప్రకాశ్ : ఔను.

మాలతి : పాపం! అడ్డం వచ్చానా? (కూర్చుని) అన్నీ సర్దుకున్నావనే అనుకుంటా. అబ్బ! అలిసిపోయా.

ప్రకాశ్ : (పతకంమీద రాత చదువుతూ) "రాత్రింబవళ్ళు పుట 121- పంక్తులు 11, 12"

వాలాయ్ : (బల్ల శుభ్రంచేస్తూ) చేవల చెత్తాకూలుడా సర్దేయ మంటారా, దొరా?

ప్రకాశ్ : సర్దు. బెత్తాలు కావాలి. పుస్తకాలు యిచ్చేశెయ్.

వాలాయ్ : సరే - దొరా.

ప్రకాశ్ : (తనతో) పుట 121. పంక్తులు 11, 12. ఆ పంక్తుల్లోయేం వుంది? (మాలతితో) యింట్లో నా పుస్తకాల ప్రతులున్నాయా?

మాలతి : ఆ-చదువులగదిలో మూలపెట్టెలో వున్నాయ్.

ప్రకాశం : పుట 121... (వెళ్ళిపోతాడు)

మాలతి : అన్నాయ్! నువ్వు, ఇంటిదగ్గరే వుండిపోవడంమంచిది.

సంగతి. యింట్లో తనసంగతెవరికీ పట్టలేదనీ తనది జాలిపడ బతుకని భావిస్తున్నట్టు స్పష్టంగా కన్పిస్తోంది.

మాలతి : అయితే యేం చెయ్యగలను? (ఆలోచించి) యేదైనా వుద్యోగం చూపిస్తే....

శేఖరం : (యీలవేస్తూ సంకోచంతో) ఉత్తమమార్గం... డబ్బున్నవాడు... మనిషిలా బట్టలు వేసుకోవాలా, చూడు. మూడేళ్ళనుంచీ ఒక్కటే చొక్కా, కోటుంటూ తీసే తీసు గదా! అదైనా చాలీచాలంది. పాట్లేసి...(నవ్వుతూ) యేదో కొంచెం కులాసా కాలక్షేపం మంచిది... ఫారిన్ వెళితే బాగుంటుంది... యేమంత ఖర్చవుతుందేం?

మాలతి : సరే_వో సూటుకుట్టించి పెట్టుకున్నా. ఫారిన్ వెళ్ళడం! అబ్బే! ప్రస్తుతం సూటూ లేదు, గీటూ లేదు. (దృఢనిశ్చయంతో) నాదగ్గిర డబ్బులేదు. (శేఖరంనవ్వుతాడు) నాదగ్గిర డబ్బేం లేదు.

శేఖరం : (యీలవేస్తూ) ఔనౌను. క్షమించు. కోప్పడకు. నీమాటనమ్ముతా... నువుమహా గొప్పదానివి.

మాలతి : (కన్నీళ్ళతో) నాదగ్గిర డబ్బేం లేదు.

శేఖరం : నాదగ్గిర డబ్బులేదు గాని వుంటే యిస్తును. దమ్మిడీ అయినా లేదు. (నవ్వుతూ) పింఛనంతా సముద్రానికే పోతుంది. డబ్బుతీసుకొని వ్యవసాయానికి గొడ్ల మేతకీ తగలేస్తున్నాడు. గొడ్లూ గోదా చచ్చిపోయాయ్. యెడ్లను వాడుకో నివ్వడు.

మాలతి : అవును నాదగ్గిర డబ్బుంది కాని నేనునటిని. ఒక్క దుస్తులే నన్ను నాశనం చేసేస్తున్నాయ్.

శేఖరం : నా హృదయాగారానికి. ముద్దుల మురిపాని వే చెల్లీ!...
నిను గౌరవిస్తా ... గౌరవిస్తా... కాని... వంట్లో బాగుండ
లేదు... (నత్తిగా) తలతిరుగుతోంది. (బల్ల పట్టుకుని)
జబ్బొస్తావుంది.

మాలతి : (భయంగా) శేఖరం! (చేయూత యిద్దామని
యత్నిస్తూ) వాలాయ్ సాయం! సాయం! (తలకట్టుతో
వసంత్, సూర్యం ప్రవేశం)

మాలతి : మూర్ఛలావుంది.

శేఖరం : మరేం లేదు, మరేం లేదు. (నీళ్లు తాగుతూ చిరు
నవ్వుతో) తగ్గి పోయింది... తగ్గి పోయింది.

వసంత్ : (చెల్లితో) భయపడకమ్మా! ప్రమాదం యేం లేదు లే.
మామకి తరచు యిలావస్తూనేవుంటుంది. (శేఖరంతో)
పడుకో మామా!

శేఖరం : ఆ - ఓనిమిషం పడుకుంటా... అయినా పట్నం
పోవాలి... కాసేపు పడుకొని మరీ వెడతా... యిప్పుడు
వంట్లో బాగానేవుంది. (కుర్చీమీద ఆనుకుంటూ నిద్రాక్రమణ)

సూర్యం : (చేయూతయిస్తూ) పొడుపుకథ, ఉదయం నాలుగు
కాళ్ళతో, మధ్యాహ్నం రెండు కాళ్లతో సాయంత్రం
మూడు...

శేఖరం : (నవ్వుతూ) సరిగ్గా రాత్రి వీపుమీదా! యికనడవగలం.

సూర్యం: మొండుకీబెట్టు! (యిద్దరూ వెళ్లిపోతారు)

మాలతి : నన్నెంత భయపెట్టాడు!

వసంత్ : మామ పల్లెటూళ్లోవుంటం అంతమంచిది కాదు.
ఫుత్సాహం వుండదు. అమ్మా! నువ్వేగనక దయదలచి

పదిహేనువందలు అప్పైపెట్టావంటే ఓ సంవత్సరంపాటు పట్నంలో గడుపుతాడు.

మాలతి : నాదగ్గర డబ్బెక్కడుంది. నేనదో వేషాలు వేసుకునేదాన్ని. వస్త్రవ్యాపారమేం చేయటంలేదు.

వసంత్ : అమ్మో! కట్టుమార్చు. నీవు కాని కట్టుకడతావ్.

మాలతి : (ఐడిన్, కట్టుగుడ్డలూ తీసి) డాక్టరింకా రాలేదు.

వసంత్ : పదింటికే వస్తానన్నాడు. మధ్యాహ్నమైంది.

మాలతి : కూర్చోవాన్నా! (కట్టువిడదీసి) తలపాగా చుట్టుకున్నట్టుంది. నిన్న వంటింట్లోకి యెవరో కొత్తమనిషివచ్చి నువ్వేజాతివాడవని అడిగాడు. చాలాభాగం నయమైంది. కొంచెమే పచ్చిగా వుంది. (తలదుద్దుకుని) నే వెళ్ళిపోయాక మళ్ళీ తుపాకీతో కాల్చుకోకేం!

వసంత్ : కాల్చుకోనమ్మా, అప్పుడేదో పిచ్చి తెగింపు పుట్టింది. ఆపుకోలేకపోయాను. మళ్ళీ అలా చెయ్యనులే (చేయిముద్దిడుకుని) బంగారపు చేతులు! చాలాకాలంకితం- జ్ఞాపకముంది. అప్పుడు నేను చిన్నవాణ్ణి ... మనదొడ్లో పోట్లాటైంది. చాకలిదాన్ని చావగొట్టారు ... జ్ఞాపకముందా? స్మృతితప్పిపడిపోతే లేవదీశారు ... ఆమెకి మందులు తీసుకెళ్ళేదానివి. ఆమె పిల్లలకి నీళ్ళుపోసేదానివి. జ్ఞాపకంలేదూ?

మాలతి : (కొత్తకట్టుకట్టి) లేదు.

వసంత్ : అప్పుడు మనయింట్లో యిద్దరు డ్యాన్సుచేసేవాళ్ళుండే వాళ్ళు. నీతో కలిసి కాఫీ తాగడానికి వస్తూండేవాళ్ళు.

మాలతి : ఆ-జ్ఞాపకముంది.

వసంత్ : మన్నెంతో ప్రేమించేవాళ్ళు. (ఆగి) యీమధ్య నిన్ను చంటితనంలో లాగా అతిగా ప్రేమిస్తున్నా. నువ్వు తప్ప నాకింకెవరున్నారు? కాని ఆయన కెందుకలా లొంగి పోతున్నావ్.

మాలతి : ఆయన్ని నువ్వు అర్థంచేసుకోలేవు. యెంతో గొప్ప వాడు...

వసంత్ : ద్వంద్వయుద్ధానికి నేను సవాల్ చేయదలచానని తెలియగానే పిరికిపందలా పారిపోతున్నాడు. పాపం!

మాలతి : యేమిటీ గొడవ? యిక్కడనించి వెళ్ళిపొమ్మని నేనే చెప్పా.

వసంత్ : మహాగొప్పవాడు! ఆయన మూలంగా రోజూ మనం పోట్లాడుకుంటున్నాం. కచేరీ సావిడిలోనో, తోటలోనో మనల్ని తలుచుకుని నవ్వుతున్నాడు... లేకిచదువు చెబుతూ తాను ప్రతిభావంతుణ్ణని దానిచేత వొప్పించాలని ఆయన ప్రయత్నం.

మాలతి : నాతో విరసంగా మాట్లాడటమంటే నీకు మహా సరదా. ఆయనంటే నాకు గౌరవంవుంది. నాముందు ఆయన్ని గురించి చెడుగా మాట్లాడకేం.

వసంత్ : నేను అతన్నేం గౌరవించను. ఆయన శేముషీధురం ధురుడని వొప్పుకోమంటావా? క్షమించు అబద్ధమాడలేను. ఆయనరచనలు డోకొస్తాయ్.

**మాలతి :** పుర్రోషం! ప్రతిభ లేకుండా దొంగ వేషాలు వేసే వాళ్లు యథార్థ ప్రతిభ వున్నవాళ్ళని తొక్కేస్తారు! అదే వాళ్ళ పోరాటం.

**వసంత్ :** (వెక్కిరింతగా) యథార్థప్రతిభ! (కోపంగా) అలాగైతే మీ అందరికంటె నాకే యెక్కువ ప్రతిభ వుంది. (కట్టు విప్పేసి) గాడిదల్లా నడిచే మీకు కళాప్రపంచంలో నాయకత్వం వహించారు. మీరు చేసేదే చెలామణి కావాలని సిద్ధమైందని భావిస్తారు. తక్కిందంతా తొక్కిపారేసి గొంతు నులుముతారు! నీ గొప్ప చెప్పలేను. నీ గొప్పనీ, అతని గొప్పనీ కూడా చెప్పలేను.

**మాలతి :** కుక్క మూతి పిందె!

**వసంత్ :** నువ్వు పేకించే స్టేజీకి తిరిగి వెళ్ళు. ఆ చెత్త నాటకాల్లో మళ్ళా వేషాలు వెయ్యి.

**మాలతి :** అలాంటి నాటకాల్లో నేనెన్నడూ వేషాలు వెయ్యలేదు. నన్ను వొంటరిగా వుండద్దూ, నువ్వు చెత్త హాస్యమైనా రాయలేవు. నువ్వు! పురుగా! ముష్టి వెధవా!

**వసంత్ :** శోభిముండా!

**మాలతి :** వెధవ వద్దమ్మా!

(వసంత్ కూర్చుని మెల్లిగా యేడుస్తాడు)

**మాలతి :** ప్రాయాపేయాలేని వెధవా! (ఆందోళనతో పచారు చేస్తూ) యేడవకు... యేడవకు... (యేడిస్తూ) యేడవకు (నుదురు, బుగ్గలు, తల ముద్దుపెట్టుకుని) నా ముద్దుబిడ్డా! క్షమించు... నీ పాపిష్టి తల్లి ముండని క్షమించు...

వసంత్ : (తల్లిని కావలించుకుని) నీకు తెలిస్తే నా? సర్వనాశ నం! ఆమె నన్ను ప్రేమించడం లేదు, ఇక రాయలేను... నా ఆశలన్నీ అడుగంటాయి.

మాలతి : నిరాశ చెందబోకు. అంతా సవ్యంగానే జరుగు తుందిలే. ఆయన వెళ్ళిపోతున్నాడు. ఆ అమ్మాయి తిరిగీ నిన్ను ప్రేమిస్తుంది. (కన్నీళ్లు తుడిచి) యిక చాల్లే. మళ్లీ యథా విధిగా మెలగుదాం.

వసంత్ : అవునమ్మా!

మాలతి : (దయతో) ఆయనతో కూడా రాజీపడు. ద్వంద్వ యుద్ధం అవసరమేమిటి?

వసంత్ : సరే - అమ్మా! ఆయన్ని కలుసుకోమని మాత్రం పట్టుబట్టకు. బాధకల్గుతోంది... భరించలేను.

(ప్రకాశ్ ప్రవేశం)

వసంత్ : యిక... వెళ్లిపోతా... (మందులూ కట్లూ పెట్టెలో పెట్టి) కట్టుసంగతి డాక్టరు చూస్తాడులే...

ప్రకాశ్ : (పుస్తకంలో వెదుకుతూ) పుట 121, పంక్తులు 11 12, యిదిగో... (చదువుతాడు) "నా ప్రాణమే కావలసి వస్తే రా - తీసుకో" (వసంత్ నేలమీదనించి కట్టుగుడ్డలు తీసుకుని వెళ్లిపోతాడు)

మాలతి : (గడియారం చూసి) యిప్పుడే యెడ్డొస్తాయ్.

ప్రకాశ్ : (తనలో) "నా ప్రాణమే కావలసివస్తే రా తీసుకో"

మాలతి : అన్నీ సర్దుకున్నావనుకుంటా?

ప్రకాశ్ : (ఆతురతతో) ఆ - ఆ - (ఆలోచించి) అమాయకు రాలి యీ విజ్ఞప్తిలో విషాదస్వరం ధ్వనిస్తోందేం? నా

హృదయమెందుకింత బాధతో ముడుచుకుపోతోంది?...
"నా ప్రాణమే కావలిసివస్తే, రా తీసుకో" (మాలతితో)
యింకో రోజుందాం. (మాలతితిరస్కారంతో తలూపుతుంది)

ప్రకాశ్ : వెడిపోదాం,

మాలతి : ప్రియా! నువ్వెందుకుండామంటున్నావో నాకు తెలుసులే. ఆపుకో, మైకం కప్పినట్టుంది - తెలివి తెచ్చుకో.

ప్రకాశ్ : నువ్వూ తెలివి తెచ్చుకో, గ్రహించుకో. సబబుగా ప్రవర్తించు. యిదీ నా విన్నపం. నన్ను నిజమైన స్నేహితునిలాగా పరిగణించు. (ఆమె చెయ్యి నొక్కుతూ) నువ్వు త్యాగం చెయ్యలేవ్... స్నేహితురాలివిగామాత్రంవుండు. నన్ను విడిచిపెట్టు...

మాలతి : (తీవ్రఆందోళనతో) యేం? అంత మతిపోయిందా?

ప్రకాశ్ : నన్నామె ఆకర్షించింది. నాక్కావలసిం దిదే నను కుంటా.

మాలతి : పల్లెటూరి పిల్లప్రేమ! ఆహాహా! నా సంగతి నీకేం తెలుసు?

ప్రకాశ్ : ఔను. కొంతనుంచి నిద్రట్లో నడుస్తారు. సీతతో మాట్లాడుతున్నా, నిద్రపోతున్నా ఆ అమ్మాయి కనిపిస్తున్నది... మధురస్వప్నాలు, అద్భుతస్వప్నాలు నను వశపర్చుకున్నాయి... నను వదిలిపెట్టు...

మాలతి : (వణుకుతూ) ఉహుం- ఉహుం- నేను సామాన్యురాల్ని. నాతో యిలా మాట్లాడకూడదు. నన్ను వేపుకు తినకు ప్రకాశ్!... భయమేస్తుంది.

ప్రకాశ్ : నువ్వు తలుచుకుంటే యేమన్నా చెయ్యగలన్. ప్రేమ—పడుచు ప్రేమ, సుందర ప్రేమ, స్వప్న ప్రపంచంలోకి మోసుకుపోయే కవిత్వంలాంటి ప్రేమ... అటువంటి ప్రేమ వొక్కటే యీ భూమ్మీద ఆనందం గొల్పుతుంది. అటువంటి ప్రేమ యింతవరకూ నే ననుభవించలేదు. పడుచుదనంలో వ్యవధి లేకపోయింది. పత్రికా సంపాదకుల చుట్టూ తిరగడంతోనే కాలం గడచిపోయింది. దారిద్ర్యంతో పోరాడాను... యిప్పుడు యిదిగో, అటువంటి ప్రేమ చిట్టచివరికి లభ్యమైంది, ఆకర్షిస్తోంది ... పారిపోవడంలో అర్థమేముంది ?

మాలతి : (కోపంతో) మతేమన్నా పోయిందా యేం ?

ప్రకాశ్ : పోనీ పిచ్చివాణ్ణిలాగా వుండనీ.

మాలతి : నన్ను వేధించుకుతినాలని మీరంతా యివాళ కుట్ర పన్నారు. (ఏడుపు)

ప్రకాశ్ : (తలపట్టుకుని) అర్థంకాదు. అర్థం చేసుకోవు.

మాలతి : నా ముందీవిధముగా యితర స్త్రీలను పొగుడుతున్నావే, నేనేం ముసలిదాన్నయానా, అందం చెడిపోయిందా ? (కావలించుకుని) ఓ నీకు పిచ్చెత్తింది. నా సౌందర్య, అద్భుత... నా జీవితంలోని ఉషారేఖా ! (మోకరిల్లి) నా ఆనందమా ! నా స్వర్గమా ! నా తలమానికమా !... (మోకాళ్ళు కావిలించుకుని) ఒక గంటసేపు నువ్వు దగ్గర లేకపోతే తట్టుకోలేను. మతిపోతుంది. మతిపోతుంది... నా దివ్యమూర్తీ ! నా దేవతా, నా రాజా...

ప్రకాశ్ : యెవరన్నా వస్తారు. (లేవదీస్తాడు)

మాలతి : కానీ, వస్తేనేం. నిన్ను ప్రేమిస్తున్నందుకు సిగ్గు పడను. నా రత్నాలరాజా! నా పిచ్చికొండా! పిచ్చి పిచ్చి పనులు చేసూంటాననుకుంటున్నావా? (నవ్వుతూ) నువ్వు నావాడివి... నువ్వు నావాడివి... యీ నుదురు నాదీ... యీ నేత్రాలు నావి... అందమైన పట్టులాంటి యీ జుట్టు నాదీ... నువ్వంతా నావాడివే. నీ ప్రతిభా, నీ గ్రహణ శక్తి అత్యుత్తమం. ఆధునిక రచయితల్లో నువ్వు వుత్తమోత్తముడివి. నీ వొక్కడిమీదనే తెలుగుదేశం ఆశ పెట్టుకుంది... నిష్కాపట్యం, నిరాడంబరం, నూతనత్వం, సున్నితహాస్యం నీ సొమ్ము... వొక్క కలం పోటుతో పాత్రల సహజస్వరూపం, దృశ్యాల సహజ స్వరూపం చిత్రించగలవు నీ పాత్రలలో జీవం వుంది. నీ రచనలు చదివి ఆనందించకుండా వుండలేరు ముఖస్తుతి అనుకుంటున్నావా? పొగడ్త అనుకుంటున్నావా? నా కళ్ళల్లోకి చూడు... చూడు అబద్దాలకోరుదాన్నిగా కనిపిస్తున్నానా? గ్రహించుకో. ప్రకాశ్! నిన్ను మెచ్చుకోగల్గింది నేనొక్కదాన్నే, నా ముద్దుల మురిపెమా, నా అద్భుత... వస్తున్నావు గదూ... ఔను. నన్ను వదిలిపెట్టవు.

ప్రకాశ్ : నాకు యిచ్ఛాశక్తి అంటూ లేదు. నా కెన్నడూ లేదు... మాంద్యం, దుర్బలం, యివి స్త్రీని ఆకర్షిస్తాయా? తీసుకు వెళ్ళిపో. తీసుకువెళ్ళిపో. నిన్ను విడిచి వొక్క అడుగైనా వేయనీయబోకు.

మాలతి : (తనలో) లొంగిపోయాడు. (యేం జరగనట్టు సులువుగా) అయినా, వుండాలని వుంటే వుండిపో. నేనొక్క

దాన్నే వెడతాలే. తరవాత వోచారంలో సువ్యోదుగాని. జౌను యేమంత తొందరొచ్చింది?

ప్రకాశ్ : ఉహూ యిద్దరం కలిసేవెడదాం.

**మాలతి :** సరే – నీయిష్టం. అలాగైతే కలిసేవెడదాం...
(విరామం) (ప్రకాశ్ నోటుపుస్తకంలో రాసుకుంటాడు)

మాలతి : యెందుకా రాయటం?

ప్రకాశ్ : యీ వృదయం చక్కటిమాటవిన్నా, "నసళన్య" యెప్పటికైనా వుపయోగిస్తుంది. (ఒళ్ళువిరుచుకుని) అయితే, వెళుతున్నామన్నమాట. మళ్లీరైళ్లు, స్టేషన్లు, కాఫీ హోటళ్లు, యిడ్లీ, ఖాతాఖానీ...

రామనాథం : (ప్రవేశించి) సవారీబండి తయారుగా వుంది. వేళైంది. దొంగసానీ! రైలు రెండుగంటల అయిదునిమిషాలకు వస్తుంది... వొక్కవుపకారం చేసిపెడ్దూ. యాక్టర్ రావుని గురించి మర్చిపోకుండా వాకబుచేద్దూ! బతికే వున్నాడా? ఒకప్పుడు యిద్దరంకలిసి తిరిగేవాళ్ళం!... విలన్ వేషాలు మహాగొప్పగా యాక్టుచేసేవాడు...తొందరలేదువొరసానీ! యింకో అయిదునిమిషాలు ఆగొచ్చు. వొక నాటకంలో కుట్రదారు వేషంవేసి హఠాత్తుగా పట్టుబడ్డప్పుడు 'వలలోచిక్కాం' అంటానికి 'కలలోచిక్కాం' అన్నాడు. (యికిలిస్తూ) కల! మాట్లాడుతూ వాలాయ్ పెట్టి సర్దుతున్నాడు. దాసిమాలతికి గొడుగు, తెచ్చి యిస్తుంది. వంటవాడు ఎడమవైపునించి సంకోచంతో చూచి వస్తాడు. సుశీల, శేఖరం, సూర్యం ప్రవేశం)

సుశీల : (చిన్న బుట్టతో) యివిగో, దోవలో తింటానికి బత్తాయిలు అతితియ్యానివి. రుచూడండి.

మాలతి : నువ్వెంతో మంచిదానివి సుశీలా!

సుశీల : శెలవు! మీకేదైనా లోపం జరిగితే క్షమించండి. (విచారపడుతుంది)

మాలతి : అంతా బాగానే జరిగింది. యేలోటూ రాలేదు. యెందుకట్లా విచారపట్టం?

సుశీల : కాలం గడిచిపోతోంది?

మాలతి : యేం చేయగలం?

శేఖరం : (కోణం తేలిన ఓవరుకోటు, హాటు ధరించి చేతో కర్రపట్టుకుని ఎడమవైపునించి ప్రవేశం) ఛల్లాయ్! వేళైంది. ఆలస్యంచేస్తే రైలు తప్పిపోవొచ్చు. అదీ అసలు సంగతి. బండీ దగ్గిరికి వెడుతున్నా... (వెడతాడు)

సూర్యం : స్టేషనుకు నడిచేవస్తా ... మిమ్మల్ని పంపించడానికి త్వరగానే వస్తా... (వెడతాడు)

మాలతి : శెలవు ... అందరమూ బతికి బాగుంటే వచ్చే వేసంగిలో తిరిగీ కలుసుకుందాం. నన్ను మర్చిపోకండి (వంటవాడికి మూడురూపాయలిచ్చి) ఇవి మీ ముగ్గురికీ.

వంటవాడు : దండాలు. సుఖంగా వెళ్ళిరండి. మీ దగ్గిర పనిచేయడమంటే హాయిగా వుంటుంది.

వాలయ్య : సుఖంగా వెళ్ళిరండి!

రాము : ఉత్తరాలు రాస్తుంటే సంతోషిస్తాం. శెలవు.

మాలతి : అబ్బాయియేడీ? బయలుదేరుతున్నానని చెప్పండి. వెళ్ళేముందు చూడాలి. మర్చిపోకండి. (అంతా కుడి

# నాల్గో అంకం

[ శేఖరం కచేరీ సావిడి. వసంత్ దిక్కు చదువుల గదిగా మార్చారు. లోపలికి కుడి ఎడమ వైపుల ద్వారాలు. ఎదురుగా మేడమీదకు గాజు తలుపు. కచేరీ సావిడికి కావలసిన సామానులు సామానేగాక ప్రాతబల్లకూడా వుంది. ఎడమ తలుపు దగ్గర ఒక కుర్చీ. బీరువానిండా, కిటికీలలో, కుర్చీల మీదా పుస్తకాలు. సాయంకాలం. చీకటి పడుతోంది. కాగితం చుట్టిన లాంతరు వెలుగుతోంది. బయట చెట్లు పెళ పెళారవం. ప్రవేశం : రాజ్యం, సూర్యం]

రాజ్యం : (పిలుస్తూ) వసంత్ ! వసంత్ ! (చుట్టూ చూసి) యెవరూ లేరు. ముసలాయన నిమిష నిమిషానికీ వసంత్ యేడీ, వసంత్ యేడీ ! అని అడుగుతున్నాడు. అతన్ని విడిచి బతక లేడు.

సూర్యం : వొంటరిగా వుండడమంటే ఆయనకి భయం ! (వింటూ) వెధవగాలి ! చిన్నటినించి వొకటేగాలి !

రాజ్యం : (దీపం హెచ్చిస్తూ) సరోవరంమీద కెరటాలు ! పెద్ద పెద్ద కెరటాలు !

సూర్యం : తోటలో చీకటి ! తోటలోని ఆనాటకశాల పడ గొట్టివెయ్యమని చెప్పాలి. వృథాగా—యెముకలగూడులా,

ఏకాహ్యంగావుంది. తెర గాలికి రెపరెప కొట్టుకుంటున్నది. కింగక్కగాత్రి ఆ దారినవెళుతూంటే యేడ్పు విన్పించింది.

రాజ్యం . యేంవ్రూహా !... (విరామం)

సూర్యం : రా యింటికిపోదాం.

రాజ్యం : (రానని తలూపి) యీరాత్రికి యిక్కడే వుండిపోతా.

సూర్యం : (బ్రతిమాలుతూ) రా రాజ్యం, బిడ్డకి ఆకలి వేస్తూంటుంది.

రాజ్యం : పోదూ, వదిన అన్నతినిపిస్తుంది లే. (విరామం)

సూర్యం : పాపం ! తల్లి దగ్గర లేకుండా మూడోరాత్రికూడా బిడ్డ గడపాలి.

రాజ్యం : అబ్బ ! విసుగెత్తిస్తున్నావ్ ! పూర్వం వేదాంతం మాటాడే వాడివి. యిప్పుడు "బిడ్డ, యిల్లు, బిడ్డ, యిల్లు! ఒకటేగోడవ !

సూర్యం : రా. రాజ్యం!

రాజ్యం : ఊహు - మీరొక్కరే వెళ్ళండి.

సూర్యం : మీ నాన్న బండి తోలుకెళ్ళనీయడు.

రాజ్యం : యిస్తాడు అడగండి.

సూర్య : అడగిచూస్తా. అయితే రేపు తప్పకుండా వస్తావు గదూ ?

రాజ్యం : రేపా - ఊ - పోదూ.

[ వసంత్, సుశీల ప్రవేశం. వసంత్ తలగడా, రగ్గూ సుశీల దుప్పటీ తెచ్చి కుర్చీమీద పెట్టారు. వసంత్ వాతబల్ల దగ్గరకు వెళ్ళి కూర్చుంటాడు ]

రాజ్యం : యివన్నీ యెందుకమ్మా ?
సుశీల : శేఖరంగారువక్క వసంత్ గదిలో పెయ్యమన్నారు.
రాజ్యం : నేను వేస్తాలే. ఊఁ. వెయ్యనీ (పక్క వేస్తుంది)
సుశీల : ముసిలాళ్లూ, పడుచాళ్ళూ అంతా వొకటేరకం !

[వ్రాతబల్లదగ్గరకు వెళ్ళి మోచేయి దానికానించి వ్రాతప్రతివంక చూస్తుంది. విరామం]

సూర్యం : అయితే వెళుతున్నా రాజ్యం ! అత్తా, శెలవు.
సుశీల : (కష్టంగా) సరే, వెళ్లు. అన్నిటికీ భగవంతుడే వున్నాడు. వెళ్ళిరా నాయనా !

(వసంత్ మౌనంగా చెయ్యి కదిలిస్తాడు. సూర్యం నిష్క్రమణ)

సుశీల : (వ్రాతప్రతి వంకచూస్తూ) వసంత్ ! నువ్వు పుస్తకాలు రాయడమే పనిగా పెట్టుకుంటావని యెవరూ అనుకోనూలేదు, కలగనాలేదు. పత్రికలవాళ్ళు డబ్బు పంపటం ప్రారంభించారు. బాగుంది, నాయనా ! (జుట్టుమీద చెయ్యివేసి) అందంగాకూడా తయారయావ్ ! ... ముద్దుల వసంత్ ! మా రాజ్యాన్ని యింకా కాస్త ప్రేమతో చూద్దూ.
రాజ్యం : ఆయన్ని వొంటరిగా వుండనీయలే అమ్మా !
సుశీల : (వసంత్ తో) మహాగుణవంతురాలు ! (ఆగి) వసంత్ ! స్త్రీకి యేం కావాలి ? వొక్క చల్లనిచూపు ! అనుభవం మీద చెబుతున్నా. (వసంత్ బల్లదగ్గరనుంచి మాట్లాడకుండా వెళ్ళిపోతాడు)

రాజ్యం : వారికి కోపం తెప్పించావ్. వ్యథపెట్టకుండా వుంటే బాగుండేది.

సుశీల : నిన్ను చూస్తే జాలేస్తోందే మా అమ్మా !

రాజ్యం : నామీదేం జాలి చూపక్కర్లా !

సుశీల : నీయిూలంగా నా మనస్సు బాధపడుతోంది. అంతా చూచా. గ్రహించా.

రాజ్యం : పోనిద్దూ ! అమితగాఢప్రేమ అంతా నవలల్లోనే? మనసు స్వాధీనంలో వుంచుకోవాలి. యేదో జరుగుతుందని, సముద్రంవొడ్డున కూర్చుని మంచి గాలికోసం నిరీక్షించినట్టు నిరీక్షించకూడదు...హృదయంలో ప్రేమ ప్రవేశించగానే పూర్తిగా తరిమేయాలి. మా ఆయనికి యింకో పూరు బదిలీ అయేట్టుంది. అక్కడికి వెళ్ళితే ... అంతా మర్చిపోతా...హృదయంలోనుంచి ప్రేమను కూకటివేళ్ళతో సహా పెకలించివేస్తా.

(విచారసూచక సంగీతం రెండు గదుల అవలనుంచి వినిపిస్తుంది)

సుశీల : వసంత్ హార్మనీ వాయిస్తున్నాడు. వుత్సాహంగా లేడన్నమాట !

రాజ్యం : (నిశ్శబ్దంగా నాట్యంతో రెండు మూడడుగులు వేసి) ఆసులు సినయ యేంగాటే వసంత్‌నూ నేను చూడకుండా వుండాలి బదిలీ అయితే ఒక్కనెల్లో అంతా మర్చిపోతా!

(ఎడమవైపు ద్వారం తెరుచుకుంటుంది. శర్మ, సూర్యాశేఖరాన్ని కుర్చీలో తీసుకువస్తాగు.)

సూర్యం : యింట్లో ఆరుగుర మున్నాం. బియ్యా లే రూపాయిదాకా యెక్కి పోయింది !

శర్మ : అయితే పెద్దచిక్కే కాదూ ?

సూర్యం : మీ బోటివాళ్ళకి నవ్వులాటగానే వుంటుంది. నీకేం యినపెట్టెనిండా డబ్బు మూలుగు తోంది.

శర్మ : డబ్బు ! ముప్పై యేళ్ళు రాత్రనకా పగలనకా నానా అవస్థపడి వైద్యం చేస్తే పదివేలు మిగుల్చుకునే సరికి బ్రహ్మాండమైంది. అవైనా యీ మధ్య ఫారిన్ వెళ్ళి రావడంతో ఖర్చయి పోయాయి. ఒక దమ్మిడీకూడా నిలవ లేదు,

రాజ్యం : (భర్తతో) యింకా వెళ్ళలా ?

సూర్యం : (అపరాధిలా) మీ నాన్న బండి కట్టించ లేదు.

రాజ్యం : (అమిత బాధతో మెల్లగా) యిక నీ ముఖం చూడ కూడదు.

(ఎడమవైపు సగంలో కుర్చీ ఆగుతుంది. సుశీల, రాజ్యం, శర్మ కుర్చీకి దగ్గరగా కూర్చుంటారు. సూర్యం విచారంతో పక్కకు వెళతాడు.)

శర్మ : చాలా మార్పులు చేశారే. కచేరి సావిడి చదువుల గదిగా మారింది !

రాజ్యం : వసంత్ రాసుకుంటానికి యిక్కడ యెక్కువ అను కూలంగా వుంటుంది. యే క్షణంలో నైనా తోటలోకి వెళ్ళి ఆలోచించుకో వచ్చు.

(కాపలావాడు తలుపు కొడతాడు)

శేఖరం : చెల్లాయి యేదీ ?

శర్మ : ప్రకాశ్‌ను కలుసు కుంటానికి స్టేషనుకు వెళ్ళింది. యిప్పుడే వస్తుంది.

శేఖరం : చెల్లాయిని పిలిపించవలసి వచ్చిందంటే నాకు ప్రాణం మీాదికి వచ్చిందన్నమాట ! (కొంచెం ఆగి) ఆశ్చర్యంగానే వుంది–ప్రాణంమీాదికి వచ్చింది. అయినా మందవ్వనే లేదు.

శర్మ : యేం మందు కావాలి. సి. ఎ. క్యూ చుక్కలా ? సోడా విస్కీనైనా ?

శేఖరం : మళ్ళీ వేదాంతం మొదలెపెట్టా ! నాకిదేం శిక్ష ! (పక్కవైపు తలూపి) నా కోసమేనా ?

సుశీల : మీా కోసమే.

శేఖరం : (కృతజ్ఞతా సూచకంగా తలవంచుతాడు)

శర్మ : (కూనిరాగంతో) "అర్ధరాత్రి ఆకాశంలో, అడుగో, చందమామ !"

శేఖరం : నవల రాసేందుకు వసంత్‌కు కథావస్తువు చెబుదామనుకున్నా. ఆ నవలపేరు "కోరికలు". పూర్వం నావయసు చుదనంలో గ్రంథాలు రాద్దామనుకున్నా. కాని రాయలేదు. అనర్గళంగా కోర్టులో వాదిద్దామనుకు నేవాణ్ణి. కాని విసుగు పుట్టించేవాణ్ణి... (తన్నుతానే వెక్కిరించుకుంటూ) "అదీ, అసలు విషయం..." వాదన ముగిసూ చెమటకాలువలు గట్టేవరకు గుటకలు మింగేవాణ్ణి... పెళ్ళి చేసుకుందామనుకున్నా – అదీ చేసుకోలేదు. పట్నంలోనే వుండిపోదామనుకున్నా – కాని పల్లెటూర్లో జీవితం ముగిస్తున్నా.

శర్మ: గవర్నమెంటు అక్వాయిజరుని కావాలనుకున్నావ్, అయ్యావ్. యింకేం?

శేఖరం: నేనేం దాన్ని కాంక్షించలా. దానంతటదే వచ్చి పడింది.

శర్మ: అరవై రెండేళ్ళొచ్చి జీవితంలో అసంతృప్తి ప్రకటించడం మంచిది కాదు.

శేఖరం: మొండిఘటం! నాకింకా బతకాలనే వుంది తెలుసా?

శర్మ: అత్యాశ! ప్రకృతి సూత్రాల ప్రకారం ప్రతిజీవికీ చావు తప్పదు.

శేఖరం: నీకేం కడుపునిండిన బేరం! అందుకనే జీవితమంటే నీకు ముఖావం. అంతా నీ కొకటే. నీకైనా చావంటే భయమే.

శర్మ: మృత్యుభయం పశుప్రవృత్తి. అణిచేసుకోవాలి. స్వంత జీవితంలో నమ్మకముండి తాము చేసిన పాపాలకు భయపడే వారికి మృత్యువంటే భయం వేస్తుంది. నీకు మతంలో విశ్వాసం లేదు. యేం పాపాలు చేశావ్? యిరవై అయిదేళ్ళు కోర్టులో పనిచేశావ్. అంతే—

శేఖరం: (వ్యంగ్యంగా) యిరవై అయిదేళ్ళ కర్మం, యిరవై ఆరేళ్ళు...

(వసంత్ వచ్చి శేఖరం పాదాలవద్ద బల్లమీద కూర్చుంటాడు. రాజ్యం అతనినుంచి దృష్టి మళ్ళించదు)

శర్మ: మనం వసంత్ రాతకోతలకి అడ్డంవస్తున్నట్టున్నాం.

వసంత్ : అబ్బే!

సూర్యం : విదేశాలలో నీకేపట్నం బాగా నచ్చింది, డాక్టర్ !

శర్మ : జెనివా!

సూర్యం : యెందుకనీ ?

శర్మ : యెందుకనా ? అక్కడ వీధుల్లో జనం గుంపులు! గుంపులు ! సాయంకాలం హోటల్నించి బైటికి వెడితే వీధివీధంతా జనంతో కిక్కిరిసివుంటుంది. వంకరటింకరగా, యే లక్ష్యమూ లేకుండా అటూ యిటూ గుంపుతో నడవచ్చు. గుంపుతో నివాసం. శారీరకంగా గుంపుతో మిళితమవుతాం. వసంత్ నాటకంలో లీల నటించిన విశ్వాత్మ వునికి సాధ్య మనేవిశ్వాసం కుదరనారంభిస్తుంది. సమయానికి జ్ఞాపకం వచ్చింది. లీల యిప్పుడెక్కడుంది ? యెలావుంది ?

వసంత్ : బాగానే వుందనుకుంటా.

శర్మ : యేదో వింతజీవితం గడుపుతోందని విన్నా. యేమి టదంతా ?

వసంత్ : అదో పెద్దగాథ, డాక్టర్ !

శర్మ : అయితే క్లుప్తంగా చెప్పు. (విరామం)

వసంత్ : యింట్లోంచి పారిపోయింది. ప్రకాశ్ తో సంబంధం పెట్టుకుంది. నీకు తెలీదూ ?

శర్మ : ఊఁ- తెలుసు.

వసంత్ : వో పిల్ల పుట్టి చచ్చిపోయింది. ప్రకాశ్ కి ఆమె మీద ప్రేమ అంతరించింది. అనుకున్నట్టే మళ్లీ పాతవాళ్ళ దగ్గిరికే చేరాడు. అసలు పాతవాళ్ళను వదిలితేగా! పట్టికుక్క

బుద్ధి. నాకువచ్చినసమాచారాన్నిబట్టి తెలుసుకోకల్గినంతలో వ్యక్తిగత జీవితం పూర్తిగా పతనమైపోయినట్టే!

శర్మ: నటన!

వసంత్: యింకా అద్భాన్నం! పల్లెటూళ్ళల్లో వేషాలు వేయడం మొదలెట్టింది. ఆ రోజుల్లో ఆమెని నాదృష్టి పథంనించి దాటనీయలా. కొంతకాలంపాటు ఆమెయెక్కడి కెడితే అక్కడికల్లా వెళ్ళా. పెద్దపెద్ద వేషాలు వేసేదేగాని మోటుగా హడావిడిచేస్తూ రసవిహీనంగా అభినయించేది. యేడ్వడంలో, చావుసీనులోయాక్టు చేయడంలో మంచి ప్రతిభ కన్పించేదిగాని అదైనా యెప్పుడో వొకమాటు.

శర్మ: మొత్తంమీద యేదోకొంత ప్రతిభ వున్నదన్నమాట!

వసంత్: చెప్పడం కష్టం. యేదో కొంత ప్రతిభ వుందను కుంటూ. ఆమెను చూచాను. కాని నన్ను కలుసుకో టానికి ఆమె యిష్టపడలా. నౌకర్లు ఆమె గదిలోకి నను వెళ్ళనీయలా. ఆమె మనోస్థితి గ్రహించి చూడాలని నేనూ పట్టుబట్టలా. (ఆగి) యింకా యెక్కువేం చెప్పలేను. తర్వాత నేను యింటికి తిరిగి వచ్చినాక ఆమె దగ్గరనుంచి వుత్తరాలు వచ్చాయి. గ్రహణశక్తి, ప్రేమ, మోహంతో కూడిన వాలేఖలు. వాటిలో ఆమె యేమీ మొరపెట్టుకో లేదు. కాని యేమాత్రం ఆమె సుఖపట్టంలేదని ఆ లేఖల వల్ల గ్ర[illegible]ంచా. ప్రతిపంక్తీ ఆమెగోని విసుగునూ, అలసటనూ బైటపెట్టింది. మతికూడా కొంచెం చెడ్డట్టుంది.

పుత్తరాల చివర 'నీటికాకి' అని సంతకం చేసింది. పుష్కిన్ 'నాగకన్య' అనే రచనలో పిండి పిసరేవాడు తాను నీటి కాకినని చెప్పుకున్నాడు. అలాగే లీల కూడా పుత్తరాలలో తాను నీటికాకినని పదే పదే చెప్పుకుంది. యిప్పుడిక్కడే వుంది.

శర్మ: యిక్కడంటే యెక్కడ?

వసంత్. బస్తీలో, హోటల్లో బసచేసింది. అయిదురోజుల నుంచీ వో గది తీసుకుని వుంటోంది చూద్దామని వెళ్లాను. రాజ్యంకూడా వెళ్ళింది. కాని ఆమె యెవర్నీ చూడను పొమ్మంది. నిన్న భోజనానంతరం యిక్కడికి రెండుమైళ్ళలో పొలాల్లో లీలను చూచానని సూర్యం చెప్పాడు.

సూర్యం. అవును, చూచా. బస్తీవైపు నడిచి వెడుతోంది. ఆమెని కలుసుకుని మమ్మల్నందర్నీ చూట్టానికి రాలేదేం అని అడిగా, వస్తానన్నది.

వసంత్: ఉహూఁ రాదు. (ఆగి) వాళ్ళ నాన్నకీ సవితల్లికీ ఆమెనిగురించి తెలుసుకోవాలనే లేదు. వారు తమపరిస రాలకుకూడా రాకుండా ఆమెను నిరోధించడానికి ఆ ప్రదేశ మంతా కాపలావార్ని పెట్టారు. (వసంత్, శర్మ వ్రాతబల్ల దగ్గిరికి వెడతారు) కాగితంమీద వేదాంతం గీకడం యెంత తేలిక!

శర్మ: ఆచరణలో యెంతో కష్టం!

శేఖరం: బలేపిల్ల!

శర్మ: ఏమిటన్నావ్?

శేఖరం : బలేపిల్ల అన్నా. గవర్నమెంటు అడ్వైజరు శేఖరం గారుకూడా కొంతకాలం ఆమెను ప్రేమించాగు.

శర్మ : నీతీ జాతీ లేని మునలయ్యా!

(రామనాథం నవ్వు వినిపిస్తుంది)

సుశీల : స్టేషనునుంచి తిరిగి వచ్చారనుకుంటా.

వసంత్ : ఆ – అమ్మ మాట అదిగో వినిపిస్తోంది.

(మాలతి ప్రకాశ్ లు వెంట రామనాథం ప్రవేశం)

రామ : మనుంతా పంచభూతాల ప్రభావంచేతముసిలివాళ్ళమై క్షీణించిపోతుంటేదొరసానీ! మీకింకాపడుచుదనం వస్తోంది! ఆ – పన్నటి రవికలు... హుషారు... నాజూకుతనం...

మాలతి : మళ్ళీ దృష్టి తగలాలనా యేం?

ప్రకాశ్ : (శేఖరంతో) బాగున్నావా? యింకా బలహీనంగానే వుందా, నయమంకాలా? (రాజ్యమును గమనించి సంశయంతో) ఒకూరో మీరా?

రాజ్యం : గుర్తుపట్టారా?

ప్రకాశ్ : వివాహమైందా?

రాజ్యం : ఆ –

ప్రకాశ్ : సుఖంగావున్నారా? (శర్మ సూర్యంలకు నమస్కరించి, వసంత్ దగ్గరికి అనుమానిస్తూ వెడతాడు) యిది వరకు జరిగిందంతా మర్చిపోయావనీ, యిప్పుడేంకోపంగా లేనట్టు మీఅమ్మ చెప్పింది. (వసంత్ చెయ్యి అందిస్తాడు.)

మాలతి : (కొడుకుతో) నీ కొత్త కథ పడ్డ పత్రిక ప్రకాశ్ తెచ్చాడు చూడు.

వసంత్ : (పత్రికను తీసుకుంటూ ప్రకాష్‌తో) కృతజ్ఞుణ్ణి.

ప్రకాశ్ : నీ రచనలు చదివిన వాళ్ళెందరో నిన్ను మెచ్చు కుంటూ అభినందిస్తున్నారు .. బెజవాడలో మద్రాసులో నీ రచనలంటే అభిరుచి యెక్కువైంది. నిన్ను గురించి అడుగుతున్నారు. యెలావుంటాడు? యెన్నేళ్ళు? నలుపా? తెలుపా? యెందుకో నువ్వు చిన్నవాడంటే నమ్మటం లేదు. మారుపేరు పెట్టుకోవటంవల్ల నీ అసలు పేరు యెవరికీ తెలియటంలేదు. సినిమాలో ముసుగుదొంగలా నీ సంగతంతా మాయగావుంది.

వసంత్ : కొన్ని రోజులపాటుంటారా?

ప్రకాశ్ : వుండను. రేపే మద్రాసు వెళ్ళిపోవాలనుకుంటున్నా. వెళ్ళితీరాలి. తొందర తొందరగా, వో నవల పూర్తిచేయాలి ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికకు యేదైనా పంపుతాననిమాట కూడాయిచ్చా. ఒక్కమాటలో ఆ పాతకథే.

(వారిలా మాట్లాడుకుంటూ వుండగా మాలతి, సుశీల పేకతీస్తారు. రామనాథం దీపం వెలిగించికుర్చీలు వేస్తాడు.)

ప్రకాశ్ : వాయుదేవుడు చిన్న చూపు చూస్తున్నాడు. హోరుగాలి! రేపుదయంగాలి తగ్గితే వేటకి వెడతాను తోటా అక్కడ ఆ చోటూ, నీ నాటకం ఆడిన చోటు జ్ఞాపకముందా? చూడాలి. బుర్రలో కథావస్తువు తయారై కూచుంది. అందులోని దృశ్యాలు వున్నచోట కూర్చుని మనసుకు తిరిగీ జ్ఞాపకం చేసుకోవాలి.

రాజ్యం : (తండ్రితో) నాన్నా! మా ఆయనికి బండికట్టించుం. ఆయన యింటికి వెళ్ళిపోవాలి.

రామనాథం : (విసుగెత్తినట్లు) బండీ! యిల్లూ! (కట్టిగా) నువ్వే చూచావుగా, స్టేషన్నుంచి యెడ్లిప్పుడే వచ్చాయి! ఇక వాటిచేత చాకిరి చేయించలేను.

రాజ్యం : యింకా యెద్దున్నాయిగా... (మాట్లాడక పోవడం గమనించి చేయి విసురుతూ) నిన్నడక్కుండా వుంటేనే బాగుండేది...

సూర్యం : నిజం. రాజ్యం! పోనీ నడిచి వెడతాలే.

సుశీల : (నిట్టూర్చి) యింతగాల్లోనే!... (పేకాటకికూర్చుంటూ) అంతా కూర్చోండి.

సూర్యం : అను మైళ్ళేగా... శెలవు. బిడ్డకోసం కాకపోతే మిమ్మెవర్ని కష్టపెట్టే వాడినికాను... (అందరికి వంగి నమస్కరించి) శెలవు (క్షమాపణ కోరుతున్న వాలకంతో వెడతాడు.)

రామ : క్షేమంగానే చేరుకుంటాడులే. యీాయనేం సేనాధిపతా ?

సుశీల : (బల్లమీాద పెట్టుతూ) రాండి. కూర్చోండి. భోజనాలకి పిల్చేదాకా కాలం వృధాపుచ్చడమెందుకు ? రాండి. (రామనాథం, రాజ్యం, శర్మ బల్లవద్ద కూర్చుంటారు)

మాలతి : (ప్రకాశ్‌తో) దీర్ఘశిశిరసాయంకాలల్లో యిక్కడ పేకాడతారు. నాడు మాచిన్నప్పుడు మా అమ్మ మాతో ఆడిన పేకయిదే. భోజనానికి ముందువొక ఆటవేద్దాం.

రామ : ఆ_నికారసైందే!

మాలతి : యిరవై !

శర్మ : సరిగ్గా యిరవయ్యేనా ?

మాలతి : మాంచి వసుంద్రైన బట్టలుకట్టా... యింకేం చెయ్య లేపోకయినా బాగా ముస్తాబుమట్టుకు గాగల...

సుశీల : వసంత్ పీణవాయిపుత్నాడు. కుంగిపోతూంన్, బిడ్డ పాపం!

రామ : పత్రికలు తిట్టిపోస్తున్నాయ్.

రాజ్యం : యిరవై రెండు!

మాలతి : వాటిని అంతగా లెక్క-చేయడమెందుకు ?

ప్రకాశ్ : అదృష్టంలేదు. అపూర్వకల్పన లేవోచెయ్యాలని చూస్తున్నాడు. కాని యింతవరకు యేమీసాధించలేక పోయాడు.అతనిరచనల్లోయెదోవింత,యెదోఅస్పష్టత - ఒకొ క్క-పుడు యెదో గోలా కన్పిస్తుంది. వొక్క- పాత్రకీ జీవం లేదు.

మాలతి : (శేఖరంకేసి తలతిప్పి) శేఖరం! విసుగెత్తుతోందా - (ఆగి) నిద్రబోయాడు.

శర్మ : 'గవర్న మెంటు అడ్వాయిజరుగారు' నిద్రబోయారు !

వసంత్ : యిరవై అయిదు !

ప్రకాశ్ : నేనే గనక అలాంటి మిరాసీలో వో సరోవరం వొడ్డున నివసిస్తూంటే కథలు గిథలు రాసేవాణ్ణేనా ! రాయాలనే ఉద్దేశాన్ని జయించి యేమీ చేయకుండా చేతనిః గడుతూ కూర్చునేవాణ్ణి.

రాజ్యం : ముప్పయి !

ప్రకాశ్ : చేపల్ని పట్టడంలో యెంతఆనందం వుందనుకున్నా!

శర్మ : వసంత్ లో నాకెంతో విశ్వాసముంది. అతడు ప్రపంచానికి చాటవలసిందేదో కొంత వుంది. రూపాలతో ఆలోచిస్తాడు. కథలు పూర్తిగా వర్ణాలతో నిండి పరిస్ఫుటంగా వుంటాయి. భావోద్రేకం కల్గిస్తాయి. కాని పాపం ! కొరివడ్డ ఆశయాలు లేవు. భావం మనసుకు హత్తుకునేట్టు చేయగలడు. అంతే – హత్తుకోవడం చాలదు. మాలతీ ! నీకొడుకు కవి అయినందుకు నువ్వు సంతోషించడంలా ?

మాలతి : వాడి రచనలేవీ యింతవరకు నేను చదవనేలేదు, చదవడానికి తీరిక చిక్కితేగా.

(వసంత్ నెమ్మదిగా వచ్చి తన బల్ల దగ్గరకు వెళతాడు)

రామ : (ప్రకాశ్ తో) ప్రకాశంగారూ, మీదేదో యిక్కడ వుండిపోయింది.

ప్రకాశ్ : యేమిటది ?

రామ : వసంత్ వొకమాటు వో నీటికాకిని కాల్చిచంపాడు. పదిలంగా దాన్ని దాచిపెట్టుకున్నాను.

ప్రకాశ్ : జ్ఞాపకంలేదు. (ఆలోచించి) ఊహు – జ్ఞాపకంలేదు.

మాలతి : ముప్పయి రెండు

వసంత్ : (కిటికీ తెరిచి వింటాడు) యేం చీకటి ! యేం చీకటి ! యెందుకింతగా తోచడంలేదో అర్థంకావడం లేదు.

మాలతి : వసంత్ ! కిటికీ మూసెయ్యి. చలిగా వేస్తోంది.

ప్రకాశ్ : ముప్పయి అయిదు... గెలుపు నాదీ

మాలతి : (సంతోషంతో) భేష్ ! భేష్ !

రామ : భేష్ !

మాలతి : ఆయనకేం, పట్టిందల్లా బంగారమే ! (లేచి) యిక వెళ్ళి భోజనం చేద్దాం పదండి ! యీ మహానుభావుడు నేడింకా భోజనం చేయలా. భోజనాలయాక తిరిగి సాగిద్దాం. (కొడుకుతో) వసంత్ ! ఆ కాగితా లలావుంచి, రా, భోం చేద్దాం.

వసంత్ : నాకేం వద్దమ్మా ! కావలసినంత తిన్నా.

మాలతి : సరే. నీ యిష్టం. (శేఖరాన్ని లేపుతూ) శేఖర్ ! భోజనానికి లే. వాత్రేయుల్లో నాకిచ్చిన స్వాగతం గురించి చెబుతా.

(వసంత్ తప్ప అందరూ నిష్క్రమిస్తారు)

వసంత్ : (రాయడానికి కూర్చుని, యిదివరకు రాసింది చదివి) సూత్న రూపాలను గురించి యేదో చెప్పారు. కాని యిప్పుడు నేనూ క్రమేపీ గానుగెద్దులా తయారవుతున్నట్టున్నా (చదువుతూ) సోడమీదయిలా ప్రకటన... "నల్లటి జుట్టుకప్పిన వెలవెలబోయే ముఖం..." ప్రకటనచప్పగా వుంది (రాసింది కొట్టేసి) వాన చప్పుడికి నాయకుడు మేల్కొన్నట్టు ప్రారంభించి రాసేస్తా వెన్నెలలో వెలిగే సాయంసంధ్యావర్ణన దీర్ఘంగా కల్పించి రాసినట్టుంది. ప్రకాశ్ కొన్ని పద్ధతులు యేర్పరచుకున్నాడు. యిలాంటి వన్ని కష్టపడకుండా రాసేస్తాడు. పగిలిన సీసామూతి ఆనకట్ట మీద మెరుస్తోందంటాడు. మిల్లు చక్రంనీడ నల్లబడుతున్నదంటాడు. వెన్నెలకు వెలిగే నిశావర్ణన పూర్తి

అవుతుంది. యికనేనో - అల్లల్లాడే దీపం వర్ణించినప్పుడూ, ప్రశాంతంగా తళుక్కుమనే నక్షత్రాన్ని వర్ణించినప్పుడూ- బాధాకరంగావుంటుంది !(విరామం) ఆ-పాతకొత్తరూపాల గొడవే లేదని అంతకంతకు నాకు నమ్మకం కుదురుతోంది. ఆత్మ లోంచి స్వేచ్ఛగా భావాలు ప్రవహిస్తున్నాయి. గాబట్టే యే రూపాలను గురించీ ఆలోచించకుండా రాయగల్గుతున్నాడు కవి. (బల్లపక్క కిటికీ తట్టిన శబ్దం) యేమిటిది ? (కిటికీలోంచి చూచి) యేమీ కన్పించడంలేదే ! (గాజు తలుపు తెరిచి, తోటలోకి చూస్తూ) మెట్లమీదనించి యెవరో కిందికి పరిగెత్తారు. (పిలుస్తూ) యెవరక్కడ ? (బయటకు వెడతాడు. డాబా పక్కగా వేగంగా నడుస్తున్న చప్పుడు. అరనిమిషం తర్వాత లీలతో తిరిగి వస్తాడు) లీలా ! లీలా !

(లీల అతని రొమ్ముమీద తల ఆనించి నెమ్మదిగా నిశ్వసిస్తుంది)

వసంత్ : (చలించి) లీలా ! లీలా ! నువ్వే ! నువ్వేనా !... యేదో దయ్యం పట్టినట్టు రోజంతా నా ఆత్మ అపరిమిత వేదన పాలైంది. ప్రియతమా ! నా రత్నాలరాశీ ! వచ్చావా ? యేడవకు, యేడవకు.

లీల : యిక్కడ యెవరో వున్నట్టున్నారు ?

వసంత్ : యెవరూ లేరు.

లీల : తలుపు గొళ్ళెం పెట్టు యెవరన్నా వస్తారు.

వసంత్ : యెవ్వరూ లోపలికిరారు.

లీల : మీ అమ్మ యిక్కడేవుంది, నాకు తెలుసు లే.

తలుపు గొళ్ళెం పెట్టు...

వసంత్ ; (కుడివైపు తలుపు గొళ్ళెం పెట్టి యెడమ ద్వారం వద్దకు వెళ్లి) యీ తలుపుకు గొళ్ళెం లేదు. అడ్డంగా కుర్చీ పెడతా (తలుపుకు కుర్చీ అడ్డంతోసి) భయపడకు. లోపలికి యెవరూ రారు.

లీల : (వసంత్ ముఖంలోకి తేరిపారజూస్తూ) నిన్ను బాగ చూడనీ (చుట్టూ చూస్తూ) భలే! ఇదిపూర్వం కచేరీ సావిడి కదూ! యెక్కువగా మారిపోయానా?

వసంత్ : ఆ- చిక్కిపోయావ్. కళ్ళు పెద్దవిగా కన్పిస్తున్నాయ్. లీలా! నిన్ను చూడగల్గడం యెంతఅదృష్టం! నీ దగ్గరకు నన్ను యెందుకు రానీలేదు. యింతకు ముందే యెందుకు రాకపోయావ్? వారంరోజుల నించీ యిక్కడ వున్నావని నాకు తెలుసు...ప్రతిరోజూ రోజుకు అనేకసార్లు నిన్ను చూడాలని వచ్చాను....నీ కిటికీకింద ముష్టివాణ్ణిలా నుంచున్నా.

లీల : నేనంటే నీకసహ్యం పుట్టిందేమోనని భయపడ్డా, వసంత్! ప్రతిరాత్రీ నువ్వు నాకేసిచూచి గుర్రుపట్టినట్టు కలగన్నా. నీకు తెలిస్తేనా? యిక్కడికి వచ్చింది మొదలు...సరోవరం వొడ్డునే నడుస్తున్నా. చాలాసార్లు మీ యింటిదాకా వచ్చాగాని లోపలికిరావడానికి ధైర్యం లేకపోయింది. రా, కూచుందాం. (యిద్దరూ కూర్చుంటారు.) కూర్చుని మాట్లాడు కుందాం. యిక్కడేంతో బాగా వెచ్చగా హాయిగావుంది. గాలిచప్పుడువిను. ఓ కవి 'యిటువంటి

రాత్రి, యింట్లో వెచ్చగా కూర్చున్న వానికెంత సుఖం' అన్నాడు. నేను నీటికాకిని... కాదు కాదు (నుదురు రుద్దుకుంటూ) యేం చెప్పుతున్నాను?... అవును ఆ కవే 'నిలువనీడ లేక తిరిగే కాకిని భగవంతుడు నత్షించుగాక' అన్నాడు... నా విషయం పట్టించుకోను (దీర్ఘ విశ్వాసం)

వసంత్ : లీలా! లీలా!

లీలా : పరవాలేదు. బాధతగ్గింది. ... నేను యేడిచి రెండేళ్ళయింది. కిందటిరాత్రి పొద్దుపోయిన తర్వాత మన స్టేజీ యింకా అక్కడే వుందేమో చూద్దామని తోటలోకి వెళ్ళాను. యింకా అక్కడే అలానేవుంది. రెండేళ్ళ తర్వాత మొదటిసారి కన్నీళ్ళు కాలువలు కట్టేటట్టు యేడ్చా. కొంచెం నయం అనిపించింది. మనసు తేలికపడింది. చూడు నే నిపుడేద్వడంలా (చెయ్యిపట్టుకొని) నువు రచయితవయావా?... నువ్వు రచయితవి, నేను నటిని... మనమిద్దరం యీ ప్రవాహంలో పడ్డాం. చంటిబిడ్డ జీవితంలా నా జీవితమూ కేవలం ఆనందమయంగావుండేది. పొద్దున్నే లేచి పాడుమనే దాన్ని. నిన్ను ప్రేమించా, కీర్తికోసం కలలుగన్నా... యిక యిపుడో రేపొద్దున్నే వాల్తేరు వెళ్ళాలి. మూడోతరగతి పెట్టెలో కూలినాలి మూకతో కలిసి ప్రయాణం... యిక అక్కడ సంస్కృతీ వరులైన మీ జాతివాళ్లు నాకోసం విరగడబడతారు. ఘోరజీవితం!

వసంత్ : వాల్తేరు యెందుకూవెళ్ళడం?

లీల : యీ శీతాకాలమంతా వేషాలు వేయడానికి వొప్పుకున్నా. యిక వేళైంది.

వసంత్ : లీలా ! నిన్ను తిట్టేవాణ్ణి, అసహ్యించుకునేవాణ్ణి.
నీవుత్తరాలు, ఫోటో చించిపారవేశా. కాని నా ఆత్మ
శాశ్వతంగా నిన్ను అంటుకుపోయిందని అనుక్షణం తెలుసు
కుంటూనేవున్నా. నిన్ను ప్రేమించకుండా వుండడం
నాశక్తికి మించినపని. లీలా నిన్ను కోల్పోయి, పుస్తకాలు
ప్రచురించడం ప్రారంభించింది మొదలూ జీవితం భరించ
లేక పోతున్నా–బాధపడుతున్నా. కోసివేసినట్టు యవ్వనం
నన్ను విడిచిపెట్టి పోయింది. యీ భూమ్మీద అప్పుడే
తొంభై యేళ్ళు గడిపినట్లనిపిస్తోంది. నిన్నుపిలిచా. నువు
కాలు మోపిన నేల ముద్దిడుకున్నా. నాజీవితంలోని అత్యు
త్తమ దినాలలో నామీద నువు ప్రసరించిన లాలన, మంద
హాసం, నీముఖం యెటుచూచినా కనిపిస్తున్న ట్లనిపించేది !

లీల : (కంగారుగా) యివన్నీ యెందుకూ చెప్పడం? యెందుకూ
చెప్పడం ?

వసంత్ : నేను యేకాకిని. నామీద ప్రేమచూపేవారే లేరు.
యే గుహలోనో నివశిస్తున్నట్టు నిరుత్సాహంతో గడ్డకట్టుకు
పోయా. నేనేంరాసినా అంతా చెత్త! కాఠిన్యం! విషాదం!
యిక్కడ వుండిపో. లీలా! బతిమాలుకుంటా...పోనీ నీతో
రానీ. (లీల గొడుగుతీసుకుంటుంది)

వసంత్ : లీలా ! యెందుకూ ? భగవత్సాక్షిగా లీలా !
(విరామం)

లీల : బయట బండి కాచుకునివుంది. నను పంపించడానికి
నా వెంట రావద్దు. ఒంటరిగానే నడిచివెడతా. (కన్నీళ్ళతో)
కాసిని మంచినీళ్ళియ్యి...

వసంత్ : మంచినీళ్ళిచ్చి (లీల తాగేవరకు ఆగి) యెక్కడికి వెడుతున్నా ?

లీల : వాల్తేరు ! (విరామం) మీ అమ్మ యిక్కడే వుండే కదూ ?

వసంత్ : ఆ ... గురువారం నాడు మామకు చాలా జబ్బు చేసింది. రమ్మని టెలిగ్రాం యిచ్చాం.

లీల : నేను నడిచిన నేల ముద్దెట్టుకున్నానని ఎందుకు చెప్పావ్, వసంత్ ! నేను చంపివేయ తగినదాన్ని. (బల్ల మీదకు వంగి) యెంత అలసిపోయాను ! కాసేపు విశ్రాంతి తీసుకో గల్గితేనా ?... విశ్రాంతి ... (తలెత్తి) విను ... నీటికాకిని ... కాదు, కాదు, నటిని. అవును. సరిగ్గా అంతే. (మాలతి, ప్రకాశ్ లు నవ్వుకోడం విని యెడమద్వారం వైపు పరుగెత్తి కంతగుండా చూస్తుంది.) ఆయనా యిక్కడే వున్నారు ... (వసంత్ దగ్గిరికి తిరిగి వెళ్ళి) సరిగ్గా అంతే ... యెందుకు ?... అవును. రంగస్థలంలో ఆయనికి నమ్మకం లేదు. నా కలలు విని నవ్వేశాడు. కొంచెం కొంచెం నాకూ నమ్మకం చెడి ధైర్యం కోల్పోయా. ఆ తర్వాత ప్రేమ ఆతురతలు. అసూయ, బిడ్డకోసం యెడ తెగని భయం ... నామరూపాలు లేకుండా పోయా ... చేతులతో యేం చేయాలో, యెలా నుంచోవాలో తెలిసేది కాదు. గొంతుకూడా స్వాధీనం తప్పింది. అసహ్యంగా నటిస్తున్నానని గ్రహించినపుడు నా మానసిక పరిస్థితి యెలా వుంటుందో నీకేం అర్థమవుతుంది ! నేను నీటికాకిని ... కాదు,

అని కాదు... జ్ఞాపకముందా, నువ్వో నీటికాకిని చంపావ్, “ఆకస్మికంగా పురుషుడు వచ్చి చూస్తాడు. కావాలని ఆమెను నాశనం చేస్తాడు... చిన్న కథకు కథావస్తువు” కాదు, అదికాదు. (నుదుటు రుద్దుకుంటూ) ఏమిటి చెబుతున్నా ... స్టేజీనిగురించి చెబుతున్నా కదూ... పూర్వంలా కాదు, ఇప్పుడు యథార్థంగా నటిని. ఆనందంతో, పరమానందంతో నటిస్తున్నా. స్టేజీనాకు మైకంకల్గిస్తోంది. మహోన్నతభావం అనుభవిస్తున్నా. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ తిరుగుతున్నా. అన్ని వేళలా ఆలోచిస్తూ తిరుగుతున్నా. ప్రతిరోజూ నాఆత్మ యెలాబలం చేకూర్చుకుంటున్నదో ఆలోచిస్తున్నా, అనుభవిస్తున్నా. నాకేం తెలీదు. అర్థమవుతోంది. వసంత్ ? మనవృత్తిలో — నటించడంలోగానీ, రాయడంలోగానీ — ప్రధానమైంది కీర్తికాదు, స్తోత్రమూకాదు. యిన్నాళ్లూ నేను కలలుకన్నదికాదు. ప్రధానమైంది శ్రమపడగలశక్తి. శ్రమించు, విశ్వసించు. నాకు విశ్వాసం కుదిరింది. అందుకే అంతగా బాధపట్టంలేదు. నా వృత్తిని గురించి ఆలోచించుకున్నపుడు జీవితం అంటే నాకు భయమేయడంలేదు.

వసంత్ : (విచారంగా) నీకు మార్గం దొరికింది — యెక్కడికి వెళ్లేదీ నీకు తెలుసు. కాని, నేనో, యెక్కడికో, యెందుకో, తెలీకుండా మనోభ్రమణలో, ప్రతిబింబాల అవ్యక్త పరిస్థితిలోపడి కొట్టుకుంటున్నా. నాకు విశ్వాసం కుదరలేదు. యేవృత్తి అవలంబించాలో తెలీదు.

లీల : (వింటూ) యిష్... యిక వెడతా. శెలవు. నేను గొప్ప తారనైనపుడు వచ్చి చూడిపో. వాగ్దానం చేస్తావుగదూ,

యిక ... (వసంత్ చెయ్యివత్తి) ఆలస్యమైంది. నుంచో లేకుండా వున్నా... అలసిపోయా. ఆకలేస్తోంది.

వసంత్ : వుండు, తింటానికేమైనా తెస్తా...

లీల : వొద్దు, వొద్దు... పంపించడానికికూడా రావద్దు. వొంటరిగానే వెడతా. బండీ దగ్గిరిలోనే వుంది... కూడా ఆయన్ని తీసుకొచ్చిందా ? పోనీ తీసుకొచ్చుకోనీ ... ప్రకాశ్‌ను కలుసుకున్నపుడు యిదంతా యేమీ చెప్పకు. ...ఆయన్ని ప్రేమిస్తున్నా. పూర్వంకంటే యింకా గాఢంగా ప్రేమిస్తున్నా... చిన్న కథకు కథావస్తువు... ఆయన్ని ప్రేమిస్తున్నా... గాఢంగా ప్రేమిస్తున్నా... అతి పిచ్చిగా ప్రేమిస్తున్నా... వెనకటి రోజులు యెంత బావుండేవి వసంత్ ! జ్ఞాపకముందా ? యెంతటి నిర్దుష్ట జీవితం ! యెంత ఉత్సాహపూరితజీవితం! ఎంతటి ఆనందమయజీవితం! ఎంతటి నిర్మల జీవితం ! యేం భావాలు ? సున్నితి దివ్యపుష్పాల లాంటి భావాలు... జ్ఞాపకముందా ? (అప్పగిస్తూ) "మానవులు, సింహాలు, గరుడ పక్షులు, కౌజుపక్షులు, దుప్పిలు, బాతులు, సాలిపురుగులు, నీళ్ళలో నివసించే మూగిచేపలు, వెలిగే చేపలు, కంటికి కనపడని జీవాలు. సమస్త జీవకోటీ సమస్త జీవకోటి, సమస్త జీవకోటీ విషాదవర్తులం గడిచి అంతరించి పోయాయి... యీ భూమ్మీద ప్రాణి అంటూ కన్పించి వేలకువేలు సంవత్సరాలైంది. పాపం! యీ చంద్రుడు వృథాగా తన వెలుగు వొలకబోస్తున్నాడు.

వచ్చి బయలు మీద కొంగలు అరుస్తూ వేళ్లాడడం లేదు. నిమ్మతోటలో కుమ్మరి పురుగులు అరవడం లేదు."

(వసంత్‌ను వుద్రేకంతో కావలించుకుని గాజుతలుపు గుండా పరుగెత్తుకుపోతుంది.)

వసంత్ : (కొంచెం ఆగి) తోటలో యెవరైనా యెదురుపడి చూసి చెప్పితే అమ్మ తలకిందులవుతుంది....

[రెండు నిమిషాల విరామం. ఈ విరామంలో వసంత్ వ్రాతప్రతులన్నీ చించి బల్లకింద పడవేసి కుడివైపు తలుపు తెరుచుకుని వెళ్ళిపోతాడు.]

శర్మ : (యెడమవైపు తలుపు తెరవాలని యత్నించి) చిత్రం! ...లోపల గడియ వేసినట్లుంది...

(ప్రవేశించి కుర్చీ యథాస్థానంలో వుంచి) ఆట...

[మాలతి, సుశీల ప్రవేశం. సీసాలు పట్టుకుని వాలాయ్ రాజ్యం వెంట వస్తారు. తర్వాత రామనాథం, ప్రకాశ్‌లు ప్రవేశిస్తారు.]

మాలతి : డ్రింకులు యిక్కడ బల్లమీద పెట్టండి. ఆడుతూ తాగుదాం. అందరూ వచ్చి మీ మీ చోట్ల కూర్చోండి.

సుశీల : (వాలాయితో) టీ సరాసరి యిక్కడికే తీసుకురా (బల్లదగ్గర కూర్చుంటుంది.)

రామ : (బీరువా దగ్గరకు ప్రకాశ్‌ను తీసుకెళ్ళి) యింత క్రితం మీతో చెప్పిన వస్తువిదిగో (సీటికాకి చేట పెయ్యానతీసి) ఏమి చేయమంటారూ?

ప్రకాశ్ : (నీటికాకి వంకజూచి) జ్ఞాపకంలేదు. (ఆలోచించి) జ్ఞాపకంలేదు

(తెరవెనక కుడివైపున తుపాకికాల్పు చప్పుడు. అందరూ ఉలిక్కి పడతారు)

మాలతి :(భయంతో) యేమిటది ?

శర్మ : ఏమ రేంలేదు. నామందుల పెట్టెలో యేదో పేలివుం[illegible] గొడవ పడకండి (కుడివైపు ద్వారంనుంచి నిష్క్రమిం[illegible] అరనిముషంలో తిరిగి వస్తాడు.) అదీ. ద్రావకంసీసా [illegible] పోయింది. (కూనిరాగంతో) "తిరిగీ నీముందిదిగో"

మాలతి : (బల్ల దగ్గరకు జరిగి కూర్చుని) అబ్బ ! యెంత భయ[illegible] వడ్డా... జ్ఞాపకంవచ్చింది.... (చేతులతో ముఖాన్ని కప్పుకొని) మూర్ఛ వచ్చేటంత వనైంది...

శర్మ : (పత్రికపుటలు తిరగవేస్తూ ప్రకాశ్‌తో) రెండు నెల[illegible] క్రితం ఓ వ్యాసంపడ్డది. ... ఢిల్లీనుంచి ఓ ఉత్తరం ! నిన్ను అడగాలనుకున్నా ...మరి...(ప్రకాశ్ భుజంమీద చెయ్యివేసి పాదతల దీపాలదగ్గరకు తీసుకువచ్చి) ఆ వస్తు స్యలో నాకెక్కువ అభిరుచి వుండడంవల్ల...(నెమ్మదిగా) మాలతిని యెక్కడికైనాసరే తీసుకుపో. యదార్థమేమంటే. వసంత్ తుపాకితో కాల్చుకుని ఆత్మహత్య చేసుకున్నాడు.

[తెర]

శోభనా ప్రెస్,
విజయవాడ–2

ప్రథమ ముద్రణ
జూలై 195[illegible]

